ఆదిశైవ గ్రంథమాల. ౬

శ్రీ

# సీమంతిని

## ఐదంకముల నాటకము



గ్రంథకర్త:

బ్రహ్మశ్రీ గూడూరు వేంకటశివకవి

మొదటికూర్పు

శ్రీఆదిశైవ పత్రికయందు పత్రికాధి పతులచే,

ప్రకటింపఁ బడియె;

రజత ముద్రాక్షరశాల, తెనాలి

1929

వెల 0—12—0

# పీఠిక

ఈనాటకము రచించియెన్నియో యేండ్లాయెను. గాని ముద్రించునంతటి యవకాశములేక ముద్రింపనైతిని. స్వకీయనాటకసభవారిచే పలుమారులీనాటకముఁ బ్రదర్శించి వన్నెగాంచెనని యెల్లరకువిదితమే!

ఈకథ శ్రీమాన్ ధ॥ కృష్ణమాచార్యులగారిచే రచియింపఁబడిన చిత్రనళీయానంతరమై యుండుటచేతను, యితరులురచియింపకుండుటచే తనుదీనివ్రాయ నుత్సాహవంతుండనై వ్రాసితిని.

ఇందలి పాటలు ప్రస్తుతము ముద్రింపనైతిని. యీనాటకము పత్రికయందు ముద్రించుటచేతను పాటలను సవరించి వ్రాయుటకుతీరిక లేకుండుటచేతను ముద్రించలేదు. అదియు ద్వితీయముద్రణమునపూర్తి కాగలదు.

ఇయ్యది శైవకథావిధానమగుటచే "ఆదిశైవ" పత్రికాధిపతి గారీ నాటకమును తమ పత్రికయందు ముద్రించెదమని తెలుప వారికీ నాటకమిచ్చితిని. శ్రీపత్రికాధిపతిగారెంతయు వందనీయులు.

కథానాయకుఁడు నళచక్రవర్తిపౌత్రుఁడు-నిషధాధిపతి యగు నింద్రసేనుని తనయుడై చంద్రాంగదుఁడన కీర్తివంతుండై విలసిల్లుచుండెను. చిత్రనళీయానంతరమైన కథయగుటయేగాక సోమవారవ్రతమై, మహత్తరమగు ప్రభావముచే విలసిల్లుచు శైవకథావిధానమై యలరారుచున్నది.

ఈనాటకమునందు స్త్రీపాత్రములెక్కుడుగనున్నవని ప్రదర్శకు లెంచవలదు. సీమంతిని విద్యనభ్యసించు నపుడు ఆమెతోడి కొందఱు విద్యార్థినులుండిన బాగుండునని వ్రాసితిని. పాఠశాలను వాడుట విడచుట ప్రదర్శకుల యనుమతినే చేయందగును.

గూడూరు వెంకటశివకవి,

గ్రంథకర్త.

## సంపాదకీయ భూమిక.

ఈ నాటకము శైవకథావిధానమై, చిత్రనళీయానంతర కథయై, విరాజిల్లుటచే మా "ఆదిశైవ గ్రంథమాల యందొక కుసుమముగా గైకొనబడెను. గ్రంథకర్త లిదివరకనేక నాటకములు కృతియొనరించి యుండుట పాఠకులెఱింగియుండుటచే; మేము మరల వ్రాయుట చర్విత చర్వణము. వీరువ్రాసిన నాటకములన్నియు సామాజికులనేక పర్యాయములు ప్రదర్శించి యానందించియున్నారు. వీరుగుంటూరుజిల్లా వేజండ్ల యందాదిశైవ వంశమునందుద్భవించి సుప్రసిద్ధ కవీశ్వరులై ప్రకాశించుచున్నారు. యీ "సీమంతినీ" నాటకము ప్రచురించుటచే, ఆదిశైవ పత్రిక ధన్యురాలైనది. పాఠకులీనాటకమును పరిశీలించి యిందలి నీతులను దెలిసికొనెదరుగాత. పరమేశ్వరుని యాజ్ఞానుసారముగా శ్రీయుతులు గూడూరు వేంకటశివకవిగారిని సహస్ర నమస్కారములతో యభినందించుచున్నారము. పరమేశ్వరుడీ మహామహుని కాయురారోగ్యముల నొసంగి రక్షించుగాత!

[సంపాదకుడు.]

# ఈ నాటకము నందలి ముఖ్యపాత్రలు

## పురుషులు.

| | |
|---|---|
| చిత్రవర్మ | రాజధాని పురాధీశుఁడు |
| సుగుణాకరుఁడు | మంత్రి |
| ఇంద్రసేనుఁడు | నిషధాధీశుఁడు |
| చంద్రాంగదుఁడు | కథానాయకుఁడు ఇంద్రసేనుని కుమారుఁడు |
| భీమబలుఁడు | ఇంద్రసేనుని దాయాదులు |
| ధీమంతుఁడు | |
| దండకరుఁడు | వీరిదూత |
| యాజ్ఞవల్క్యముని | గురువు |
| బ్రాహ్మణులు | |
| తక్షకుఁడు | సర్పరాజు |
| అశ్వసేనుఁడు | తక్షకు కుమారుఁడు |
| నీలవక్త్రుఁడు | రాక్షసుఁడు |

## స్త్రీలు.

| | |
|---|---|
| సీమంతిని | కథానాయకి |
| కమల | సీమంతిని దాసి |
| విలాసవతి | సీమంతిని తల్లి |
| మైత్రేయి | గురువుభార్య |
| శ్యామలాంబ | బడిపిల్లలు |
| దుర్గాంబ | |
| కమలాంబ | |
| లలితాంబ | |

N.B. కవులు - నాటకులు - వేటకాండ్రు - వర్తకులు.





శ్రీ

# సీమంతిని

## నాంది

శా॥ శ్రీమత్తద్విరదాదితేయగణ దుర్వ్యాళత్కృత్తిచేలంబు ను
ద్దామ శ్రీ వెలయంగదాల్చి మహిభృత్కన్యాసమేతంబు గా
క్షేమంబందిన మేటి శంకరుడతి శ్రేయంబులందంద వి
ద్యామోదంబులనిచ్చుమాకు బరమాహ్లాదంబురంజిల్లగన్॥

[ప్రవేశము:-నటుడు]

నటి యింకను రాకున్నది కారణమేమి? అబ్బ! స్త్రీలకెంతకాల మైనను శృంగారంబునకు జాలదుగదా? నటీ! యేల యీజాలము? యింకను శృంగారము ముగియలేదా?

[ప్రవేశము:—నటి]

ఆర్యా! ఏమిశెలవు?

నటు—శెలవునకేమిగాని యింతజాలమేల జేసితివి?

నటి—ఆర్యా! భూషణాంబరముల ధరించుటలో జాగైనది. యిపుడు శెలవేమి?

నటు—నేడు నూతననాటకమొంకు ప్రదర్శింపc దలచితిమిగదా? మరచితివా?

నటి—నూతన నాటకమా? దాని నామమెద్ది? రచించిన వారెవ్వరు?

నటు—నాటకమాడ నుద్యమించియు కవిపేరు నెఱుంగవా? నాటక మెఱుంగవా?

గీ॥ నవరసంబుల శృంగార ♦ నవకముగను
వరశిరీషపేశలవాక్య ♦ భరితమైన
సోమవార మహాత్మ్యంబు ♦ జోద్యముగ ర
చించె, గూడూరు ♦ వేంకటశివుఁడతండు॥

నటి—ఓహో! తారాచంద్రీయాది నాటకముల రచించిన మన వేంకటశివ కవియేనా?

నటు—అవును. దీనినే "సీమంతిని" యని యందురు.

నటి—అటులనా! యావ్రత ప్రభావ మేమి?

నటు—ఈక్షితితలంబునంగల వ్రతములలో "సోమవారవ్రతము" ను మించిన వ్రతము వేరొండుగానరాదు గాన యీవ్రతము చాతుర్వర్ణముల వారు స్త్రీ పురుష భేదము లేక హితమతితో నతి సంతసంబతిశయించ సోమవారముల బ్రదోషసమయయం దందు సోమశేఖరుని షోడశోపచారంబుల బూజించినవారలుసుఖానువర్తులై మెలంగుదురు. యీవ్రతమాచరించి యనేకులు ముక్తి నొందిన వారలు గలరు.

నటి—ఆర్యా ఈవ్రత ప్రభావమంతటిదా?

నటు—అంతటిదాయని నుడివెదవేల? వర్ణింపనలవిగాదు.

(లోన ధ్వని కల్గును)

ప్రేయసీ! రాజధానిపురాధీశ్వరుండగు చిత్రవర్మమహారాజుసభకు వచ్చుచున్నట్లు దోచుచున్నది. మనముపోవుదయ రమ్ము.

నటి—చిత్తమురండు.

(ఇర్వురు నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.

శ్రీ

# సీమంతిని

## ప్రథమాంకము

[ ప్రవేశము: చిత్రవర్మ, సుగుణాకరుఁడు, ]

చిత్ర - అమాత్యవరా! సకలవిద్యాప్రౌఢిమంబున ముదిమించే మదిచెదరిన మొదటిదేవరయగు విరించినైన పరిభవించఁబూనరించెడి బ్రాహ్మణోత్తములును, పౌరుషంబున భార్గవునైనఁగని దూరంబుగాఁ బాఱఁదోలఁజాలిన పార్థివోత్తములును, భాగ్యంబున నలకాధ్యక్షుండగు కుబేరునైన బేరంబడంచుధీరతగల వైశ్యరత్నములును, హాలముచేగలిగిన యైశ్వర్యంబున నీశ్వరునినైనఁ గని నగియెడి నాలవ జాతివారును, నాట్యవిద్యాతిశయంబున రంభాదుల సంబరంబడంచు వేశ్యాసుందరులాదిగాఁగల వారలందఱు తమ వర్ణాశ్రమంబుల దప్పక సుఖంబుగ నెలంగు చుండిరా?

సుగు - (లేచి) కం. నరపాలచంద్ర! మీచేఁ
బరిపాలనఁ జేయునట్టి పట్టణమిపుడా
సురపాలునగరిఁ గేరఁగ
గరమొప్పెను సుజనకలిత! సౌఖ్యంబగుచున్

"ఆర్యావర్తః పుణ్యభూమిర్మధ్యం విన్ధ్యహిమాగయోః
ఆర్యాధార్మికావర్తంతే అస్మిన్నిత్యార్యావర్తః"

ధార్మికులచే నిర్మలముగా నిండియుండు నియ్యార్యావర్త దేశం బనుభూరమణిమణియొక్క మెడయందిడిన తారహారమందలి నాయక మణివలె ప్రకాశమున ప్రాకటించెడి యిప్పట్టణమందు నిర్మలంబగునే

ధర్మాసక్తులరై మీరుధరణీపాలన జేయుచుండఁ గానంతయైనఁగొఱంత సంఘటిల్లునా?

చిత్ర- (తలనూపును)

[ ప్రవేశము. సేవకుఁడు ]

దేవా! పౌరులుకొందరుతమ్ము దర్శింపవచ్చినారు.

చిత్ర- సత్వరమవారినిటకు గొంపోనిరమ్ము.

సేవ- చిత్తము. (నిష్క్రమించును)

[ కాపులతో సేవకుఁడు పునఃప్రవేశము ]

స్రగ్విణి. రాజరాజేంద్రమా । రాకవీక్షింపుమా
రాజసంబెల్ల నా । రాజ్ల జేరెంజుమా
యీజగంబందు మే । మెంతొగానుంటిమా
కీజనాంతంబు నే । డింపుదప్పెంజుమా
భూరిగా బిడ్డలం । బాలికన్మమ్ములం
జేరఁగాఁదీసిపో । షించినారియ్యలం
బారసిల్లెన్ మృగాల్ । తాళలేమింక బె
న్వారపివ్వీట నె । వ్వారు లేరారయన్

అందరు- మాదొరా! మీపాదాలకుదండాలు. (నమస్కరింతురు)

చిత్ర- కాపులారా! మృగములుచెల రేగినంతనే మీరిట్లుభయాకులిత
చిత్తులైపరుగిడి రావలసినంత ప్రమాదమొదవెనా?

గంగ- ఏమనివిన్నవింతుము? చాలయుగచాట్లుగల్గెను.

రంగ-గీ. మృగసమాజము బహుచెల । రేగి చేలకు
తోటలెల్లన, ద్రవ్వి తు । త్తునియుచేసి
తోటకాపరిదైన పు । త్రునికరమ్ము
గట్టిగాఁబట్టి చీల్చెను । గంగుడక్క

దొరా! నేనేమనిచెప్పగలను? చేతికి కాలికక్కరకువచ్చిన
కొడుకునకు త్రిప్పలువచ్చినవి

చిత్ర- రామరామ ఎంతఘోరము.

సంగ- అయ్యో! ఆలిమగడుంటే దినమునకొకబిడ్డను గనవచ్చునండి యిక నాగతి యినండి.

ఆ. పాడుగాఁదినెనయ్యో మా । పంటచేలు
గేదెమేతకుబోయిన । నాదుభార్య
పైనిబడి, గోళ్లరక్త ప్ర । వాహములుగఁ
జీరెబెబ్బులి, నేనేమి । చెప్పువాఁడ.

చిత్ర- హరిహరి!

సంగ- బాబూ! నాపెండ్లము నాదిగాదు.

మంగ- దొరా! యేమిచెప్పుదును.

గీ. పల్లెచెంతనుమేపెడి । పసువులందు
బుంగసిండగఁబొలిచ్చు । పుల్లగోపు
నట్టిబెబ్బులివేయంగ । నడ్డగించి
నట్టినాసోదరునిజంపె, । నయ్యో! బాబు.
బిడ్డలను పెళ్లాన్ని సంపాదించుకోవచ్చునుగాని తమ్మునెచ్చట సంపాదించుకోగలను? దొరా!

చిత్ర- అయ్యోయెంత సంతాపము.

గంగ- బాబు మనవి.

గీ. ఇన్నిచెప్పంగనేల మే । మున్నయట్టి
పల్లెలనువిడి వేగమీ । ప్రాపుజేరి
యున్నమీబిడ్డలను దయ । యుంచిబోవ
కున్న, నొక నిమిషంబైన । నుండగలమె?
ఇంకమమ్ముగాపాడకున్న మా బ్రతుకు లుత్తివియె.

చిత్ర- కాపులారా! చింతనొందకుఁడు. ఇకనిండ్లకుబొండు. నేను మీ వెంటనే తగుప్రయత్నముతోవచ్చి మృగములనెల్లఁ దెగటార్చి మీ కష్టములఁబాపెద. మీరుభయమునఁదకపొండు.

కాపు- బాబూసెలవు. (నిష్క్రమింతురు.)

చిత్ర- సేవకా! వీరభయంకరాగారులగు మృగయులగొందఱ సత్వరంబుగా దగుసన్నాహంబుతో వేటకురమ్మని నాయాజ్ఞ దెల్పుము.

సేవ- చిత్తము. (నిష్క్రమించును.)

చిత్ర- అమాత్యవరా! నేడు వేట కేగవలెనుగదా?

సుగు- చిత్తము.

చిత్ర- మృగయులేగియేయుందురు. ఇంక జాగు సేయరాదు.

సుగు- చిత్తము. (నిష్క్రమింతురు.)

యవనిక జారును.

ద్వితీయరంగము—అడవి.

[ ప్రవేశము: చిత్రవర్మ, వేటకాండ్రు ధనుర్బాణములతో ]

చిత్ర- మృగయులారా!

సీ. దారుణంబైన మహారణ్యమున క్రూర
వ్యాఘ్రమృగాదన వారణములు
వానరగవయాచ్ఛ భల్లఝిల్లివరాహ
జంబుకహరి మహిషంబులాది
గాఁగల ఘోరమృగప్రచయంబెల్ల
మనమాడితిమి కడుదోర్బలమున
నిక నెందుజూచిన నేజంతువొక్కటైనఁ
గనబడదాయె నిక్కము గణింప

గీ. వేటమార్గమునకువచ్చు వేళమించి
నైవకతమున ప్రజబాధనడఁగె, మనకు
గష్టమంత్రవీసమంతైనఁ గల్గనీక
బ్రోచినటువంటి మేరుచాపుని దలంతు.

వేట- దేవరవారు వేటసల్ప జంతుసంతతులుండునా? ప్రజలకు నేటితో మృగబాధలు నశించినట్లె.

చిత్ర- మృగయులారా! ఇక పురప్రవేశ మపుడము రండు. కాల

ప్రొద్దయినది. వేటతమకముచే చాల శ్రమజెందినాడను. దివాకరువేడిమి హెచ్చుగనున్నయది. రండుపోదము.

వేట- చిత్తము. తురంగరత్నము గుడారముచెంతనే గలదు. దేవర వారింక పయనముగండు.

చిత్ర- మంచిది. పోదమురండు. (నిష్క్రమింతురు.)

యవనికజారును.

## ప్రథమాంకము.

### తృతీయరంగము—రాజధానిలో చిత్రవర్మయాస్థానము.

[ప్రవేశము:- చిత్రవర్మ, సుగుణాకరుఁడు.]

చిత్ర—అమాత్యవరా! క్రూర జంతువుల నెల్లఁ దునుమాడి పౌరులబాధ దీర్చితిని. ఇంక జంతు సంతానమువలన భయ మిసుమంత యేని మన యేలుబడిలో లేదని నుడువగలను.

సుగు—చిత్తము. తా మస్త్రవిద్యయం దతి నిపుణులని లోక విదితమేగదా? దాని వేరుగ నుడువవలెనా?

[ప్రవేశము:- సేవకుఁడు]

రాజేంద్రా! వందనములు.

చిత్ర—ఓరీ! ఏమివార్త?

సేవ-ఉ. రాజకులావతంస! భువి ♦ రాజుల నొందఱఁ గీటడంచి బల్
రాజిత ధర్మశాస్త్రవిధి ♦ రమ్యత నొప్పగ వారిచే నరిఁ
బూజల గొన్నమేటి! ముని ♦ ముఖ్య మనోజ్ఞవిహారుఁడైనయా
రాజకిరీటు సత్కృప వి ♦ రాజిలె మీపయిఁ జెప్పనేటికిఁ.

దేవా! చిత్తగింపుఁడు.

ఉ. ఇప్పుడు సంతసం బినుమ ♦ డింప నిమేషములోన దేవిగా
రొప్పిదమైన శాస్త్రవిధి ♦ నొక్క శుభప్రదమైన కాలముఁ

దప్పకమున్నె, బుత్రిక ను ♦ దారతఁగాంచెనటంచు వేడ్కఁ బెం
పొప్పతిలంగఁ జంద్రముఖ ♦ యొయ్యన జెప్పినదో మహీశ్వరా.

చిత్ర- (సంతసమున) నాతపంబు నేటికి ఫలించినది. నాయభీష్టం బీడేరినది. సేవకా! మత్పట్టణంబునం గల బ్రాహ్మణోత్తముల సత్వరంబుగాఁ దోడ్కొనిరమ్ము.

సేవ—చిత్తము. (నిష్క్రమించును)

చిత్ర—సచివాగ్రణీ! విప్రోత్తములచే మదీయ పుత్రిక జాతక శుభంబులారయ నెంచి వారలకడకు సేవకు నంపితిని. వారలచే నాపాప పవిత్ర చరిత్ర మెఱుంగవలయు.

సుగు—చిత్తము.

[ ప్రవేశము:- కొందఱు బ్రాహ్మణులు ]

చిత్ర—(లేచి) బ్రాహ్మణోత్తములారా! నమస్కరించెద.

బ్రాహ్మ—రాజేంద్రా! శుభమగుగాక.

చిత్ర—ఇయ్యుచితాసనము నలంకరించుఁడు.

బ్రిహ్మ—చిత్తము. (కూర్చుని) దేవా! ఏమి సెలవు?

చిత్ర-గీ. విప్రవరులార! శుభవార్త విన్నవింతుఁ
బూర్వపుణ్యము వెలయంగఁ ♦ బుత్రిగల్గె
నయ్యుమేశ్వరు కృపచేత ♦ నస్మదీయ
కులము పావనమయ్యె నా ♦ కోర్కదీరె.

ఇది యటుండ నింకొక్కటి గలదు.

చ. వినుఁడిక విప్రులార! కడు ♦ వేడుక మీరఁగ మాకులంబు నం
దున జనియించు కన్యలు, జ ♦ నుల్ పొగడం సిరులొప్పగా సుఖం
బనుభవమందుచుందు రిది ♦ యట్టుల దేవమహీసురార్చనం
బనవరతంబు జేయఁగల ♦ దై వెలుగొందునో కాదో దెల్పుడీ?

బ్రహ్మ—చిత్తము. (యోచించి)

సీ. మేదినీ నాయక! మీచిన్ని కొమరిత
"సీమంతిని"యనంగఁ జెలువుగాంచి
భూమండలంబునఁ బూజ్యతకెక్కి శ్రీ
మద్రమామణి! సర్వమంగళశచి!
కందర్పసతి! యయ్యరుంధతి! సావిత్రి!
బోలి సకల భాగ్యములు సుమంగ
లిత్వంబు, సంపదలీల నాచారంబు
పరమపాతివ్రత్య పటిమనంది

గీ. వల్లభునిఁగూడి మనము రంజిల్ల దశ స
హస్ర సంవత్సరములు, సమస్తరాజ్య
భోగములఁ బొందు, మరి యష్టపుత్రుల నొక
పుత్రికారత్నమును గాంచి, పొదలునయ్య.

చిత్రి—(సంతసమున)

కం. స్వాంత మహాత్మ్యలమిట కా
సంతలో, మీవాక్యములకు నతిముద మొదవెఁ
జింతాభారము వదలెను
గంతునిమద మధను గరుణ గల్గెను నాపై.

చిత్ర—మీరలు మాచేమన్ననలంది మమ్మాశీర్వదించ వలయు నని కోర్కె.

బ్రహ్మ—చిత్తము.

2 బ్రా—(లేచి స్వ) ఎంతి వెఱ్ఱివాడీరాజు? జ్యోతిషమన నెట్టిదో తెలియని యీమందమతుల సన్మానించి నన్ను నిరాకరించుసట్లు దోచి నది. ఐన నేనీ భూపతిపై నీర్ష్య బూనఁదగదు. నిజముజెప్పి యీ యవివేక హీనులగు బ్రాహ్మణులకు సిగ్గువచ్చునట్లును, జ్యోతిశ్శాస్త్రమునకు వన్నె వచ్చునట్లును జేసెదఁగాక. కుంభినీధవా!

ఆ. విధివశంబుచేత వేగ మీపుత్రిక
కల చతుర్దశాబ్దమందుఁ బ్రాణ
నాయకుఁడు వియోగవశా యవనీశ! నా
మాట నిజము నమ్ము మానవేంద్ర!

ఇదినిజము. నిజము. జ్యోతిశ్శాస్త్రమన నెట్టిదో తెలియని యీ మంద మతుల మాటలు నమ్మవలదు. నేను వారి వీరివలె నిచ్చకము లాడు వాఁడనుగాను.

బ్రాహ్మ—(స్వ) ఏమీ? వీఁడు ఖండితముగా జెప్పుచున్నాడే. మనమే పొరఁబడితిమా. (యోచించుచుందురు)

చిత్ర—(స్వ) ఆహా! యేమీ యీవిచిత్రము? నేను పుత్రా ప్తికం బందిన పిదపఁ బుత్రికారత్నంబును నేత్రోత్సవంబుగా గన్నందు లకు నీ విప్రోత్తములన్న వాక్యంబులలో నెద్దిజరుగునో తెలియదుగదా? కట్టా దైవసంకల్పంబునకు వికల్పంబు జరుగ నేరదు. ఇదిగాక సర్వంబు దైవాధీనంబని దలంచక వెడగు రీతి జింతించిన ఫలమేమిగలదు? (ప్ర) విప్రవరులారా! నా ఫలిత మెట్లున్నదో గదా?

బ్రహ్మ—దేవా! మాకనుష్ఠానమున కకాలమగుచున్నది సెలవు.

చిత్ర—చిత్తము.

(బ్రాహ్మణులు నిష్క్రమింతురు)

చిత్ర—అమాత్యవరా! నేటికి కొల్వు చాలింతము.

సుగు—చిత్తము.

(నిష్క్రమింతురు) అవనిక జారును.

---

## తురీయ రంగము—చిత్రవర్మ యాస్థానము.



[ప్రవేశము:- చిత్రవర్మ, సుగుణాకరుఁడు, యాజ్ఞవల్క్యముని]

యాజ్ఞ—రాజా! ఏమి సెలవు?

చిత్ర-గీ. యాజ్ఞవల్క్య మహాముని యస్మదీయ
పుత్త్రికారత్నమును మీ సముఖమునందు
నుంచి, పండితురాలఁ జేయుంచ మదినిఁ
దలచితినిఁ గడతేర్పుడీ దయదలిర్ప.

నా యభీష్టము నెరవేర్పఁగలవారలు మీరలేయని నమ్మి యున్నాఁడ.

యాజ్ఞ—మంచిది. నేను సీమంతినీ రత్నమును సమస్త విద్యల యందతివిశారదత్వము గల్గునట్లు జేసెదను. ఆ బాలికనింక రావింపుఁడు.

చిత్ర—చిత్తము. సుముహూర్తముం దిలకించుఁడు.

యాజ్ఞ—అట్లనే. (యోచించి) భూనాయకా! యీ దినమంతయు శుభదినమే "శుభస్య శీఘ్రం" బను నట్లిప్పుడే రావింపుడు.

చిత్ర—ఇదియే శుభదినమా? ఐన రావించెద. సేవకా!

[ప్రవేశము:- సేవకుఁడు]

దేవా! సెలవు.

చిత్ర—సీమంతినీమణిని నభిషిక్తంజేసి సకలాభరణభూషితాలంకారాదుల శృంగారంబు గావించి దోడ్కొని వచ్చునట్లాజ్ఞ యయ్యెనని చేటికిం దెల్పుము.

సేవ—చిత్తము. (నిష్క్రమించును)

చిత్ర—ఋషీంద్రా! నేఁడే విద్యాభ్యాసము జేసెదరా?

యాజ్ఞ—ఔను. నేఁడే మంచిది.

[ప్రవేశము:- సీమంతిని, చేటి]

చిత్ర—అమ్మా! యిటురమ్ము. (సీమంతిని నెత్తుకొని) అమ్మా! నేటినుండియు నీవు చదువుకొనుము. నీకు విద్యనేర్పుటకై యీ గురువుగారి నిందు రావించితిని. వారి యాజ్ఞానుసారము విద్య నేర్పుకొనవలయును. చదువుకొందువా?

సీమం—ఆ. (తలత్రిప్పును)

చిత్ర—ఋషివర్యా! యీముద్దులబిడ్డకు మీరెంతయో శ్రద్ధగ విద్య నభ్యసింపఁ జేయవలయు.

యాజ్ఞ—చిత్తము. నాకు తడవగుచున్నయది, యీమెను పాఠశాల కనపుడి. విద్యాభ్యాస మొనర్తును.

చిత్ర—అయ్యా! అట్లుగాదు. విద్యాభ్యాసమున కిదియే ప్రథమమగుటచే నిందే యొనర్పుడు. రేపటినుండియు మీయాజ్ఞానుసరీతి పాఠశాలకే పనపుదుము.

యాజ్ఞ—చిత్తము. ఆయమ్మ నిందు గూర్చుండఁబెట్టుడు.

చిత్ర—(సీమంతిని దించి) అమ్మా! యిందు కూర్చుండి గురువుగారు చెప్పు వాక్యములు బల్కుము.

సీమం—ఆ. (తల యూపును)

యాజ్ఞ—రాజా! ఇంక జాగేల? నమస్కరించెద సెలవా?

చిత్ర—చిత్తము జాగేల?

యాజ్ఞ—సీమంతినీ! యీ ముఖముగా గూర్చుండుము.

సీమం—ఆ. (కూర్చుండును)

యాజ్ఞ—"శుక్లాం బరధరం విష్ణుం! శశివర్ణం చతుర్భుజం!
ప్రసన్నవదన ధ్యాయే! త్సర్వ విఘ్నోపశాంతయే"

(ఇది సీమంతిని చెప్పుకొనవలయును) యాజ్ఞ (స్వ) నే నిదివఱ కెందఱకో విద్యాభ్యాస మొనర్చినాడను గాని యింత కుశాగ్రబుద్ధిగలవారి నెందుఁ గాంచనైతినిగదా? (ప్ర) రాజేంద్రా! నీ పూర్వపుణ్య మింతింత

శ్రీ

# సీమంతిని.

—o—

## ద్వితీయాంకము.

---

ప్రథమరంగము — పాఠశాలగృహము.

[ప్రవేశము: శ్యామలాంబ, కనకాంబ, దుర్గాంబ, లలితాంబ.]

(పుస్తకములచేబూని)

శ్యామ — తే. గీ. నరుఁడు లనవరతము బరధనము ద్రవ్యము
నీతిఁ జూడక, పోరఁబడి చేతఁబట్టు
వసుధ నపకీర్తి గల్గు దైవంబు గూడ
శిక్షఁ జేయఁగఁ బూను నా శాస్త్రములు.-

కన — తే. గీ. ఎవరుజూడ లేదని మది నెంచి దొంగ
తనము సేయంగ, దొంగ చేతఁ దన్నులబ్బు.
పరమునందున నారక బాధ గల్గు
పరువు చెడు, కూడనిది దొంగపని యటండ్రు!-

దుర్గా — తే. గీ. భూతలంబున స్త్రీలకు నీతిలేక
బ్రతుకనేల సర్వము చెడి పోవు నిజము
తనకు దైవమొసంగిన దానఁ దృప్తి
బొంది, చిరతరముగు నీతిఁ బొందవలయు.-

లలి — క॥ ధనమెంతో గూడినఁ గుడు
వను, గట్టగనున్న నోఁచల బడి నేల్ దొసవృత్తిన్
పనిపడియుండిన సౌఖ్యము
గనుఁగొనఁగరవా? తృప్తి గల్గినవారల్.-

[ప్రవేశము: సీమంతిని, యాజ్ఞవల్క్య మహర్షి.]

(అందరు లేచెదరు.)

బరికింపక సమయము గని
పరధర్మపథంబు దెలుపవలయు దిరమతిఁగా.

(లలితాంబ వ్రాసుకొనును)

యాజ్ఞ — కనకాంబా! నీవు వ్రాసుకొనుము.

కం॥ ధనవంతులఁ గనుఁగొని భూ
షణములు, వస్త్రములు సొకు సరసంబుగ దె
మ్మని మగనిఁ బీడించెడి
పని, స్త్రీరత్నములు బూనవల దెప్పట్లన్.

(కనకాంబ వ్రాసుకొనును)

యాజ్ఞ — శ్యామలాంబా! నీవు వ్రాసుకొనుము.

కం॥ శ్రమబడి పతియార్జించిన గృ
హమునకు దీసికొనివచ్చినవి రిత్తగన
ష్టము బెట్టక మితముగ ధ
ర్మము జేసినఁ దనకుఁబుట్టు మగుడ నిజముగన్.

(శ్యామలాంబ వ్రాసుకొనును)

యాజ్ఞ — సీమంతినీ నీ పాఠముందెమ్ము.

సీమం — "పతిదినము" "ఓపడతి" (అను పద్యముఁ జదువును)

యాజ్ఞ — (సీమంతిని పలకపై వ్రాయుచు చెప్పును. సీమంతిని [పల్కును

కం॥ అత్తకు మామకు నెప్పుడు
జిత్తము రంజిలగఁ బూజఁ సేయఁగవలయుక్
మొత్తమగు నాడుబిడ్డల
జిత్తము గడునొవ్వకుండఁ జేయుట మేలౌ.

బాలికామణులారా! ఈ పద్యములఁ జక్కగాఁ జింతనసేయ వలెను. ఇక మీరిండ్లకు పొండు. దుర్గాంబా! యీ సీమంతినీమణిని యింట విడచి పొమ్ము.

(నిష్క్రమించును)

కం॥ పరపురుషు లమితసుందర
తరులైనను, శౌర్యధైర్యయుతములై యున్నన్
పరుభక్తి వదలఁగూడది
తరుణులన్నను లెత్తి చూడఁ దగదరయంగన్.

(శ్యామలాంబ వ్రాసుకొనును.)

గూర్జ — బాలికలారా! మీరలు పాఠంబులిపుడే యొప్పఁజెప్ప వలయును; వేగంబ జదువుడు. సీమంతినీ నీవిటురమ్ము. (అనిపలకనీయుకొని)

కం॥ ప్రతిదినము మూఁడు వేళల
సతతము నిదురించఁబోవు సమయంబున స
న్నుతితో నీశ్వరు మరువక
యతిభక్తి నిస్తవమొసర్పు, మనుజకుమారీ.

కం॥ ఓపడతి! నీకు నాపద
దాపరమైనప్పుడెలమిఁ దగిలిన చిత్తం
బాపదగల్గిన దుఃఖము
నేపారఁగఁబొందఁగూడ దెపుడు కుమారీ!

(ఈపద్యములవ్రాసి పెట్టి ముహూర్తము చెప్పను; సీమంతిని పలక్క న)
ఇఁకనీవు జదువుకొనుము. బాలికలారా! మీ పాఠములు చెప్పుడు

(బాలికలు నల్గురు పాఠములం దొప్పఁజెప్పుదురు.)

బాగుగనున్నవి. నూతనపాఠములం జెప్పెద వ్రాసుకొని యిండ్లకుఁబొండు.

కం॥ విధిసంకల్పముచేతను
విధవాలిటు యంగహీన విధురాంధుఁడు సం
పదహీనుఁడు, బడిసన్మతి
సగయుని నాబాలికి ... సల్పగవలయున్.

(దుర్గాంబ వ్రాసుకొనును)

గూర్జ — లలితాంబ! నీవు వ్రాసుకొనుము.

కం॥ వరుఁడు ... గహుండైనను
తరుణీమణి నిర్మలైన ధన... ములన్

సీమం——

ఉ॥ పాటలగంధులార! వనవాటిక వాటముమీరఁ జేరి చె
ల్లాటము లాడగాఁ దగిన యద్భుతలీలఁ జెలంగు బూలచెం
డ్లాటలనాడఁగా మనమునందు భ్రమంబొగిఁ గల్గె నీశుపైఁ
బాటలఁ బాడుచున్మనము బోటిల నాటల నాడుకొందమా?

మనమందరము నుద్యానవనమున కేగి కొంతదనుక నాటలనాడు కొని యిండ్లకు బోవుదము రండు.

అందఱు——సీమంతినీ! నీ యిష్టమే మాయిష్టము. పోవుదము రండు. (నిష్క్రమింతురు)

(యవనికజారును.)

## ద్వితీయరంగము——ఉద్యానవనము.

[ప్రవేశము: శ్యామలాంబ, దుర్గాంబ, లలితాంబ, సీమంతిని.]

సీమం——సఖీమణులారా! చూచితిరే నీ యుద్యానవన రామణీయము?

తే.గీ॥ సార, ఖర్జూర, సురసాల, నారికేళ,
తాల, తక్కోల, హింతాల, సాల, వకుళ,
మల్లికా, వల్లికాది సంపదలతోడ
ఘనతబెంపొందె నుద్యాన వనముజూడ.

మనమియ్యుపవనంబున బూలబంతు లాడుకొందమా?

కన——అలాగునసే. (పూలబంతులాడుదురు)

సీమఁ——ఇక నేమియాడుకొందము?

దుర్గాం——రాసక్రీడ * (రాచక్రీడలాడుదురు.)

సీమం——యికమీాదట నేమియాట నాడుదము?

శ్యామ——దాగుడుమూతలాడుదమా?

* రాచక్రీడయన వ్రేళ్లువంచి నొకరిచేత నొకరిచేయియుంచి గిర గిర తిరిగెడియాట.

సీమం—అటులనే యాడుదము. (దాగుడుమూతలాడుదురు.)

(యలసి) ఆటలాడియాడి యాలసిపోయిననన్ను గృహంబునకెల్లు జేర్చెదరో నాకేమియుండోచుటలేదు. శరీరమంతయు దిరుగుచున్నది.

(కనులుమూసికొని పడిపోవును అందఱుజేరి విసరుచు)

దుర్గా-సీమంతినీ!సీమంతిని!యింతమాత్రమునకే భయపడెదవేమి?

కన-సీమంతినీ! కన్నులువిప్పిచూడుము (అనిమోముచూచును.)

శ్యామ—సీమంతినీ! సీమంతిని! పలుకవేమి? యీమాత్రమునకేనా యాటలాడుదమని దోడ్కొనివచ్చితివి. నావంకజూడుము?

లలి—సీమంతినీ! భీతినొందకుము నిన్ను గృహంబునకు మెల్లనఁ జేర్చెదముగాని కన్నులువిచ్చిజూడుము. (కన్నులందెరుచును)

సీమం—(కన్నులువిచ్చి) అయ్యో! మీరందరుగిరగిర దిరుగుచున్నట్లగబడుచుండిరి. నామదితత్తరిల్లుచున్నది. (కనులుమూయును)

కన—నెచ్చెలులారా! సీమంతినికి నాటలచే శరీరమలసి భ్రమగల్గినది. యీమెకీభ్రమబోవునట్లు శీతోదకములచే వదనము దుడిచిన మేలని నా యూహ.

దుర్గాం—పోనీ యట్లనేజేతము. లలితాంబా! నీవా కాసారముకడకేగి యేయాకుచేనైన జలంబు లతిశీఘ్రుంబుగ దెమ్ము.

లలి—అట్లనే దెచ్చెద. జాగ్రతగఁజూచుచుండుడు. (నిllమింll)

దుర్గాం—సీమంతినీ! సీమంతిని. పలుకవేమమ్మా యీ మాత్రమునకే నింతకంగారా?

[లలితాంబ పునః ప్రవేశము] (ఆకులదొప్పయందునీటితో)

దుర్గాంబా! యీనీటిచే మోమును నేత్రములను చల్లగదుడువుము

దుర్గాం—(నీటిచే మోము నేత్రములుతుడిచి) సీమంతినీ! సీమంతిని. నావంకజూడు?

సిమం—(కనులవిప్పిచూచి) అబ్బ! అలసి నేమియుందెలియక పడిపోయితిఁగదా?

కన—సీమంతినీ యిప్పటికి కన్నులుదిరుగుటమాని హాయిగ నున్నదా?

సీమం—ఇంకను శరీరము వడకుచున్నది.

కన—అదేమిచేయునులే మెల్లగనడవుము గృహంబుజేరుదము.

మం—నేను నడువలేను. కొంచమాగుడి.

దుర్గాం—మేమందరము నీకుపూన్కానిచ్చి నడపించెదముర మ్ము. యిప్పటికేచాల ప్రొద్దయినది. కనకాంబా! శ్యామలాంబా! రండు మెల్లన నడపించుకొనుచు పోవుదము.

కన—అట్లనే. (అందఱుపట్టి లేవదీసినడపించుచుపోవుదురు. యవనిక జారును.)

---

తృతీయరంగము— విలాసవతినగరు.

[ప్రవేశము: చిత్రవర్మ, విలాసవతి.] (ఆసీనులై)

చిత్ర—దేవీ! యింకను సీమంతిని పాఠశాలనుండి రాదయ్యె కారణమేమైయుండును? నాల్గుగడియలకు పూర్వమే పాఠశాలవిడచి రని వినియుంటిని.

విలా—తోడిబాలికలం గలసి యాటలాడుచుండెనేమొ, రాగ లదులెండు.

[ప్రవేశము: సీమంతిని. లెక్కిన బాలికలు]

కన—దేవీ!ఇదుగో! మీసీమంతినీమణి, మేముపోయివచ్చెదము.

విలా—మంచిది. పోయిరండు.

(బాలికలు నిష్క్రమింతురు)

ఇంతసేపిచ్చట నుంటివమ్మా? (ఎత్తుకొని ముద్దాడి దించును)

చిత్ర—అమ్మా! ఇటురమ్ము. (చేరదీసి)చదువుకొనివచ్చితివా?

సీమం—ఆ. చదువుకొని వచ్చితిని.

చిత్ర—(సీమంతినినిజూచుచు) ప్రాణేశ్వరీ! యస్మత్సభయందవ నీసురులచే కర్ణకఠోరమగు నొకవార్త వింటిని.

విలా—(భీతచిత్తయై) నాథా! అదియేద్ది?

చిత్ర—చెప్ప నోరాడకున్నది.

విలా—నాథా! మీరంతగఁ బశ్చాత్తాపమందక నిజ ముగ్గడింప వేడెదను.

చిత్ర—

కం॥ మదగజగామిని! విను మ
 వ్వ్యాధిగతి సీమంతినికిని విశదముగ సభ్యా
 బదునాల్గవ వత్సరమున
 నుదుటుగ బతిబాయుననిరి యుర్వీసుమనసుల్.

ఇకముం దెటుల జరుగునో తెలియదుగదా?

విలా—

ఆ॥ వె॥ జీవితేశ మనవిఁ జేసెద నొకమాట
 దీనికొఱకు సుంతఁ దెలియనట్టి
 వారి రీతి, మీరు వంతనొందఁగ దఁగ
 దనఘ, వర్తమానమును గుఱించి.

నాథా! మనమిక్కన్యారత్నమును గని పెనుచుటకు దగిన వారము గాని పురాకృతకర్మ మెటులనుండెనో యద్దానినెఱుంగ నెంతటివారము? మీరింతగ వంతనొందఁదగదు.

చిత్ర—ఔను! అంతలో మానసం బజ్ఞానంబుపాలై దీనత్వంబు జెందినది.

విలా—ప్రాణేశ్వరా! దీనత్వమంది మనము చేయునదియేమి?

చిత్ర—ఔను! అంతయు దైవాధీనముగాని యొండుగాదు.

విలా—మీరు ధైర్యము విడువవలదు. యెటులైనఁ గాఁగల కార్యములు కాకమానునా? మీఁద దైవమేగలఁడు.

చిత్ర—ఔను! (తలనూపును)

సీమం—(స్వ) నా తలిదండ్రు లాడుకొను మాటలాలించ నా చెవులకు ములుకులుగ నాటినవి. నేనేమి సేయుదును? నా పురాకృతకర్మ మెవ్వరు దప్పించువారు? హా! దైవమా! నా జీవితమెట్లు గడుపనెంచితివి? నన్నుద్ధరించువాడ వీవేగదా? యిందునుగూర్చి నా గురుభార్య యగు మైత్రేయిని యాలోచించెదగాక. (యవనిక జారును)

---

తురీయరంగము—మైత్రేయి మందిరము.

[ ప్రవేశము: సీమంతిని, దాసి, మైత్రేయి ]

సీమం—తల్లీ! వందనములు.

మైత్రే—జయమగుగాక. సీమంతినీ యీపీఠ మలంకరింపుము.

సీమం—చిత్తము. (కూర్చుండును)

మైత్రే—సీమంతినీ! ఏదియో పనిబూని వచ్చితివి?

సీమం—ఏమిలేదు. మీకడ నొకసంగతి నిశ్చయించుకొనదలంచి

మైత్రే—ఏమది?

సీమం—(లేచి)

చ॥ శరణనియుంటినో పరమసాధ్వి! నను౦ గడతేర్చఁబూని భా
సురమయినట్టి సద్వ్రతము సూటిగ దెల్పి సుమాంగలిత్వముం
గరిమఁ జెలంగఁజేసి విసగావుము మేశుని పాదసాక్షిగాఁ
గరుణఁదలిర్ప నీపదయుగంబు నుదిర్ భజియింతు నెప్పుడున్.

మైత్రే—సీమంతినీ! నీ మంతనంబునం దంతగా జింత నొందక నిజము వచింపుము.

సీమం—అమ్మా! నాకు బదునాల్గవ వత్సరంబునఁ బతివియోగ మందునని జ్యోతిష్కులు మా తండ్రిగారికి దెల్పిరట. తద్విషయము మా తండ్రిగారు నిన్నటిదినంబున మజ్జననికిం దెల్పుచుండ నేనాలించితిని.

విషాదమగ్నమానసనైతిని. అమ్మా! వేయేల! నన్గరుణించి సౌమాగల్యవతినగుట కెద్దియైన నొక వ్రతమున్న నాకుం దెలిపి నా తిలకము నిల్పుము.

మైత్రి—(చిరునవ్వుతో) సీమంతినీ! నీ కింత వెడగేల? యీ లోకులెల్లరు జ్యోతిష్కుల నోటవెడలు మాటలెల్ల వేదవాక్యంబుల రీతి నిజంబని నమ్మెదరుగాని యవియెల్లఁ గల్ల.

సీమం—తల్లీ! జ్యోతిష్కుల వాక్యంబు లమోఘంబులు కల్లలనఁ జెల్లునే?

మైత్రి—తమ యాయుః ప్రమాణంబులే తమకు దెలియకఁ బరితపించెడిజ్యోతిష్కు లితరుల యాయుఃప్రమాణంబు లెట్లు జెప్పఁగలరు? యిదిగాక.

తే॥ గీ॥ జ్యోతిషము సంగ్రహించిన సరసులన్న
రీతిగా బ్రహ్మవ్రాసిన వ్రాతయుండు
నంచు దలఁచుట యవివేకమంచు మదిని
నెంచి, సంతసముగనుండు మిందుబోఁడి!

ఐన ముందుకార్యాలోచన మొందు దెల్పెద వినుము.

సీమం—చిత్తము.

మైత్రి—

చ॥ మనుజవరాగ్రగణ్య సుకుమారిక! నిర్మలచిత్తమూని యిం
పొనరఁగ సోమవారమున నొప్పుగ స్నానముజేసి వస్త్రధా
రణ మొనరించి, పార్వతిని రాజధరుం గను భక్తితోడఁ బూ
జనము లొనర్చు, సౌఖ్యము లసంఖ్యనొసంగు నఘంబడంచెడిన్.

నిర్మలాంగీ! నిర్మలాత్ములగు పార్వతీశ్వరుల సోమవారదినమందు షోడశోపచారంబులఁబూజించి ఆపైని భూసురసమారాధన లొనర్చి పిమ్మట భూసురాంగనలఁ బూజించి దివ్యాంబరాభరణాదు లొసంగుచుంటివేని నీ మనోభీష్టములు తప్పక నెఱవేరఁగలవు.

కం॥ ఇదిగాక నోక్క పెట్టా
పదలెప్పుడు ప్రాప్తమైన భక్తిని విడక
మదనమథను బదయుగముక్
మదినిల్పి భజింప నఖిల మంగళకరమా.

అమ్మాయీ! యిమ్మహావ్రతఫలంబు దెల్పెద శ్రద్ధగ వినుము.

సీ॥ శివు నభిషేకంబు జేయఁ బాపహరంబు
రహిబీఠపూజ సామ్రాజ్యకరము
గంధమాల్యాదులఁ గల్గును సౌఖ్యంబు
కరము ధూపమున సౌగంధ్యమలరు
వింత దీపంబునఁ గాంతి విశేషంబు
నైవేద్యమున భాగ్య మావహించు
తాంబూలమున సంపదయు నమస్కారంబు
వలన ధర్మాది కైవల్యమబ్బు
తే॥ గీ॥ మంత్రమున నణిమాదుల మహిమనిల్చు
విప్రభోజనమున దేవ వితతి తుష్టి
భామినీ పూజనంబుచే భాసురముగ
నున్నత సుమాంగలిత్వంబు నొందుమరియు.

నీమతి కతిహితంబుగా నీవ్రతం బొనరింపుము.

సీమం—చిత్త మట్లనే జేసెద నాకు శలవొసంగుము.

మైత్రే—చిరంజీవివై సుమాంగల్యవతివి గమ్మా.

దాసి-కం॥ ఇంతీ! గురుసతినాజ్ఞ
సంతస మతితోడ శివుని సదనంబున క
త్యంత రయంబునఁ జని నీ
చింతాశల్యంబువాయఁ జేయుము వ్రతముక్.

సీమం—ఆలాగే స్నానాదివిధుల నెరవేర్చుకొని శివాలయంబున కేగుదము రమ్మా. (నిష్క్రమింతురు) (అవనిక జారును)

నొప్పదయ్యా! భవత్పాద పద్మంబులీవట్టువం గన్నులంజూడ నేజేయు పాపంబులెల్లఁ విరూపంబులై పోవునో భక్తశల్యా! పరేనన్ను నిప్పట్ల నిల్పనమ్మదినేవగ దల్పంగదే! శంకరా! పాహిమాం! పాహిమాం!!

సఖి! కం. వావిరివిధములఁ బరమే
శ్వరుదలఁచితి, నింక భక్తి భావముతోడన్
వరదంవతి పూజనములఁ
దిరమతి నొనరింపఁదలఁచితింజుమి వేడ్కన్.

ఇప్పటికి చాలపొద్దయినది మందిరంబున కేగుదమురమ్ము. ముందొనర్పవలసిన కార్యము లనేకములు గలవు. పూజాపాత్రిల గ్రహింపుము పోవుదము.

దాసి—చిత్తము. (పూజాపాత్రిలందీసుకొనును.)

(నిష్క్రమింతురు.)

(యవనిక జారును)

షష్టరంగము—చిత్రివర్మయాస్థానము.

[ప్రవేశము: చిత్రివర్మ, సుగుణాకరుఁడు, రామశాస్త్రి]

చిత్రి—అమాత్యవరా! నాముద్దుపుత్రిక సీమంతినీమణికి బరిణయంబు సేయ నస్మన్మానసంబున దలంచితిని గాన నిషధేశ్వరుండగు జందాంగదాపనీశునకొక లేఖవ్రాసివచ్చునట్లు జేయుము.

సుగు—చిత్తము. (లేఖవ్రాసి) సేవకా! యీలేఖంగొనిచని లేఖార్థ వాహకునకిచ్చి నిషధపురంబునకుంజని నిషధేశ్వరున కొసంగ నాజ్ఞదెల్పుము. (లేఖనిచ్చును)

సేవ—చిత్తము. (నిష్క్రమించును)

చిత్రి—భూసురోత్తమా! కొంతదనుక నేమో సచ్చరిత్రిల నుగ్గడింపుఁడు యాలించ కుతూహలమయ్యె.

రామ—చిత్తము.

"దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనంతు దైవతం
తన్మంత్రంబ్రాహ్మణాధీనం బ్రాహ్మణోమమదేవతా॥

రాజోత్తమా! ఈలోకమంతయు దైవాధీనము, ఆ దైవము మంత్రాధీనము, ఆమంత్రము బ్రాహ్మణాధీనము, కాబట్టి బ్రాహ్మణులు నాకుదైవమని శ్రీకృష్ణభగవానులు చెప్పిరి.

"సత్యం మాతా పితా జ్ఞానం ధర్మోభ్రాతా దయాసఖా
శాంతిః పత్నీ క్షమాపుత్రః షడ్తే మమబాంధవః"

సత్యము-తల్లి, జ్ఞానము-తండ్రి, ధర్మము-తోడబుట్టినవాఁడు, దయ-స్నేహితుఁడు, శాంతి-భార్య, క్షమ-కుమారుఁడు. ఈయార్గురు నాకిష్టులైన బంధువులని ధర్మరాజు వచించెను.

[ప్రవేశము, సేవకుఁడు]

సేవ—రాజేంద్రా! నిషధాధీశ్వరుని కుమారులు విచ్చేయుచున్నారు.

(అందరు లేచెదరు)

చిత్ర—రాజకుమారా! యీ సింహాసన మలంకరింపుము.

చంద్రా—చిత్తము. (కూర్చుండును)

చిత్ర—చంద్రాంగదా! మీకెల్లరకు కుశలమేగదా?

చంద్రా—అందరకు క్షేమమే.

చిత్ర—రాజకుమారా! మాచిన్నికొమరిత సీమంతినిమణిని మీకిచ్చి వివాహంబు సేయ మనోనిశ్చయము జేసుకొని మీ దివ్యసుందరాకారము గనవెంచియు మీయాప్సితం బెరుంగఁదలఁచియు మిమ్మిటకు రావించితిని. మీరాకకే తయు ముదమందితిని. మీప్సితముం దెలుపవేడెదను.

చంద్రా—మీయాప్సితమే నాసమ్మతము.

చిత్రా—చంద్రాంగదా! సంతసమైనది. భూసురోత్తమా! నలచక్రవర్తి పౌత్రుండగు నీచంద్రాంగద మహీకాంతునకు మదీయతనూజనిచ్చివివాహమహోత్సవమునర్పనిశ్చయించినాడఁగాన మీరు శుభముహూర్తమొండు నిశ్చయింపుఁడు.

రామ—చిత్తము. (యోచించి) పృథ్వీచంద్రమా! యీ దివసంబునకు మూఁడవ దివసంబున దినమందు ద్వితీయ యామంబున మీన లగ్నపుష్కరకాలంబున పురందరాచార్యుఁడు వర్గోత్తమాంశను జెంది సంపూర్ణవీక్షితుండై యున్నవాఁడు. ఇట్టిశుభకాలంబున వివాహము య్యేనేని మీకన్యకామణి సకలసంపత్పుత్రసౌభాగ్యయుక్తంబై యుండుటనిశ్చయము. సందియము లేదు.

చిత్ర—చిత్తము. సేవకా! పురంబునందెల్లెడల నలంకారంబు సేయుఁడని పౌరులకుం దెల్పుము, చిత్రవర్మరాజేంద్రుని కుమార్తెను నలచక్రవర్తి పౌత్రుండగు చంద్రాంగద రాజేంద్రునకిచ్చి పెండ్లిసేయ బంచమీ దినంబున ద్వితీయ యామంబున పెద్దలు సుముహూర్తము నిశ్చయించిరని పురమెల్ల ప్రకటింపునట్లు జాంఘికునకు రాజాజ్ఞయయ్యెనని దెల్పుము.

సేవ—చిత్తము. (అని నిష్క్రమించును)

చిత్ర—అమాత్యవరా! నీవును తత్ప్రయత్నంబున నుండుము.

రామ—రాజేంద్రా! అనుష్ఠానకాలమైనది. శెలవు.

చిత్ర—చిత్తము.

(రామశాస్త్రి నిష్క్రమించును)

సుగు—దేవరవారియాజ్ఞ.

చిత్ర—తగుప్రయత్నము లొనర్పఁ బోదమురమ్ము.

(నిష్క్రమింతురు)

(యవనిక జారును)

రంగము—వీధి.

---

[ప్రవేశము : జాంఘికుఁ డొకఁడు]

ఇదుగో జనులారా! మీరందరు యినందగు. యీరోజునసుమూర్తమంట, మన చిత్రవర్మరాజుగారి కూతురును నలచక్రవర్తి పౌత్రుడంట, యింద్రసేనరాజు కొడుకంట, అయన పేరు చంద్రాంగదు డంట, ఆయన కిచ్చి పెళ్ళిసేత్తారో హొయాంగ్. మీరందరు యీరోజు మద్దేల కాడకు రావలసిందో హొయాంగ్. (చాటి నిష్క్రమించును)

---

సప్తమరంగము : రాజవీధి.

---

[ప్రవేశము : అప్పంభొట్లు, కృష్ణంభొట్లు]

కృష్ణ—జనకా! సీమంతిని వివాహమహోత్సవ మెంతో శృంగారముగా నున్నది. నా కట్లెప్పు డౌనో చెప్పవు!

అప్పం—వారికేమిరా? ఇంకెంతో చిద్విలాసముగా చేయించవచ్చును. నా మనఁ బ్రాణములున్న నెప్పుడో నీకు నట్లుచేసెదనులే. తొందరేమి?

[ప్రవేశము: శంకరంభొట్లు]

శంకరం- అప్పంభొట్లుగారు మీరెచ్చటనుండి రావడము?

అప్పం- సీమంతినీ వివాహమహోత్సవమును జూచి.

వెంకం- వివాహమైనదా?

అప్పం— ఆ. ఆ. ఆ.

వెంకం- అయ్యో! నాసంభావన మిగిలిపోయింది గాబోలు సుమండీ?

అప్పం- ఇంతదినుక రాక మీరేమిజేసిరి?

వెంకం- ఏదోమాయాపై యొకపని దలపెట్టి "దానిని గానిచ్చిపొండి" మీరన నే నాపనిమీదనుండి యీసంగతినే మరచిపోతిని. దానిముండ మోసిరిసంభావనలెండి. నే నా మహాత్మ్యము గనుల జూడక బోతినిగదా? అది యటుండనిమ్ము. రాజశబ్దము నిల్పుకొనెనా మనరాజుగారు?

అప్పం- ఆ నిల్పుకొనకేమి?

వెంకం- (అటుసిటుచూచి) ఎవరు లేరుగద? రాజుగారు కొంచము లోభియని వాడుకగా మనవారసాధ్యులుగనుకరాకు బనులు వానప్రయోగించిరేమోయని యనుకొనుచుంటిని.

అప్పం- లేదు. లేదు. కార్యము ఘనముగనేజరిగినది.

వెంకం- సరసముగనున్నవా మంత్రతంత్రములు?

అప్పం- ఉండకేమండి?

వెంకం- మంత్ర తంత్రములజెప్పిన వశిష్ఠుడెవడు?

అప్పం- మన రామంభొట్లే.

వెంకం- వాడికేమి తెలియును? వాడిముఖము.

అప్పం- అలా అనకండి.

అప్పం-వాడికేమండి గొప్ప తెలివియే సంపాదించినాడు.

వెంకం- పిమ్మటనేమి జరిగినది?

అప్పం—చంద్రాంగదునిచేత సూత్రధారణ చేయించినాడు.

వెంకం—తర్వాత?

అప్పం-పుణ్యాంగనలు కొందరు మంగళహారతులు అనేకరీతులఁబాడిరి.

వెంకం—పిమ్మట?

అప్పం—ఇంకా పిమ్మట నేమున్నది? ఎక్కడివా రక్కడనే.

వెంకం—సరిసరి బాగుగనున్నది. ఎంత చదువరులకైనను వేపకాయంత వెఱ్ఱియుండకపోదను సామిత మీయందే భొడసూపినదే?

అప్పం—ఏమిటి? వెఱ్ఱియంటిరి?

వెంక—ఇంక నేమియని యడిగెదరా? "ఎక్కడివా రక్కడనే" అన్న మాటలో నెంతయున్నదో మీరే విచారించుఁడు!

అప్పం—విచారణా గిచారణ. మీరు మంచి బుద్ధిమంతులే. "ఎక్కడివా రక్కడనే"యన మీయభిప్రాయమేమి? అచటనుండి యిండ్లకేగిరని యర్థము గాని యూరేగిరని యర్థము గాదు. ఇంక నీ మాటలు చాలింపుము. ఇందెవ్వరైనవిని రాజుగారి కంటఁగాల్చిరేని పైగా నింకొకటి కొని తెచ్చుకున్నట్లే. ఇంక పోవుదము రండు. అనుష్ఠానకాలము గావచ్చినది.

వెంకం—అవును ప్రసంగవశంబున పొద్దయినది. తెలియలేదు. పోదము రండు. (నిష్క్రమింతురు)

ద్వితీయాంకము సమాప్తము.

శ్రీ

# సీమంతిని

## తృతీయాంకము.

### ప్రథమరంగము—యమునాప్రాంతోద్యానము.

[ ప్రవేశము:- చంద్రాంగదుండు, మంత్రి, కొందరుపౌరులు. ]

చంద్రా— హితులారా! ఏమీ యీయుద్యానవనరామణీయకము? కనులపండువుగనున్నది జూచితిరే?

మంత్రి—ఔనౌను.

చంద్రా—మీరిప్పుడివ్వనలక్ష్మిని వర్ణించగలరా?

మంత్రి— మేమంత కుశాగ్రబుద్ధిగలవారమా?

చంద్రా—ఐన నాదోచినట్టుల వర్ణించెద వినుండు. ఇవ్వనలక్ష్మికి మాలూరఫలంబులే నిబ్బరమగు గబ్బిగుబ్బలును, ఇందలి సరస్సునం గల వికసించిన కమలపత్రంబులే నేత్రంబులుగను, యివ్వనంబునం గల మదేభంబులే గమనంబులుగను, మత్తబంభరసంఘంబులే శిరోరుహంబులుగను, కలకంఠంబుల కలరవంబులే మృదుమధుర భాషణంబులుగను, కమ్మని క్రొవ్విరిదిన్నెలే పరిమళోపేతంబగు శరీరంబుగను, అరటిమహీరుహంబులే యూరువులుగను, తీవయగు వల్లరుల పెంపకమే మిరుమిట్లుగొను కాంతిగల భుజములుగను, పల్లవితంబగు నవపల్లవ ప్రకరంబులే పాణితలంబులుగను, పగడంపు తీవియలే తీవియగు కరంబులుగను, సౌరభోన్నతవిభవంబగు పుష్పంబులే చిఱునవ్వుగనొప్పి ప్రత్యక్షంబుగ నివ్వనలక్ష్మి వీక్షించువారలకొక్క చక్కరబొమ్మరీతి నెక్కుడు మక్కువం బొడముసట్లు గన్పట్టుచున్నది. ఏమీ యువ్వసంతునిమహిమ? ఇంతని

జెప్ప నేరికశక్యమగును? ఇప్పుడు నా మానసారవిందంబు పరమానందమై వికసించినది. అమాత్యవరా మితిలేని యానందమందితి.

మంత్రి—క౹౹ ఓ రాజచంద్రమా! యిక
మారాడగసందులేదు మరి యివ్వనల
క్ష్మీరమణినిఁబరికించఁగ
భూరిగఁగను దామరలకుఁ బొందొనరించెన్॥

మీరుచెప్పినట్లొక యొప్పులకుప్పను బోలి యివ్వనలక్ష్మి ప్రకాశించుచున్నది.

చంద్రా-ఔను! కాని మనమెల్లరమియ్యమునంగల తరణి నధిష్టించి కొంతదనుక ఁజని మరలివత్తమురండు.

మంత్రి-చిత్తము.

(అందఱును యమునలోని యోడనెక్కుదురు.)

చంద్రా—నావికా!ఇయ్యోడ నీదెసగా నడిపింపుము.
నావి—చిత్తము, (నావికులు పడవలాగుదురు.)
చంద్రా-అమాత్యవరా! గాంచితివే?

తే॥గీ॥ దనరు హరిచందనాంచితోద్యానవనులు
పరిపరివిధంబులగు దివ్య పరిమళములు
లలిత బహువిధశుక పికాలాపములును
చంద్రకాంత శిలావేది జాలములును.

తే॥గీ॥ అట్టి శృంగారవనములో నమరపాంథ
జనము లొయ్యారముల్మీర । మరుని కేళిఁ
దేలకుండిన జన్మమింకేల? ననుచుఁ
గాపురము జేయుదురుగాని కదలఁగలరె?

మరియును.

క౹౹ అనుకూలవాలుకా సం
జనిత నితాంతపరివాళ చలదళికుల ని

స్వన హేమకమల వనములఁ
దనరు సరోవరములమరె దడయక గనుమా!

మంత్రి—నిషధరాజేంద్రా! యీశృంగారవనముజూడ అత్యంతానంద ముప్పతిల్లుచున్నది. ఆహా! ఏమి?

చంద్రా—నిజము నిజము.

మంత్రి—నావికులారా! మీనేర్పుకొలంది యెద్దియైన నొకపాటఁ బాడుడు.

నావి—చిత్తము. ఒరేబావోయ్ అయ్యగారికెలవైందియేదోఒక పాటఁబాడండ్రకె.

2నా. మామోయ్ నీవు మాఅందరికి పెద్దోడవు దబ్బున నీవే చెప్పు.

3నా. ఆ నేనేచెప్తాగాని వంతపాడండ్రకె.

నాదనామక్రియ రాగము—చాపుతాళము.

ఏలేపిల్లా నన్నేలేపిల్లా ♦ చాలించుకోపమింకేలే పిల్లా॥
బందరుపోతాంపిల్లా ♦ బాజుబందులు తెచ్చేంపిల్లా ॥ఏలే॥
గోలకొండపోతాంపిల్లా ♦ గోటుసైరెక తెచ్చేంపిల్లా ॥ఏలే॥
మదరాసుపోతాంపిల్లా ♦ మణులుకొన్ని తెచ్చేంపిల్లా ॥ఏలే॥
బెజవాడపోతాంపిల్లా ♦ పీతాంబరము తెచ్చేంపిల్లా ॥ఏలే॥
మైసూరుపోతాంపిల్లా ♦ మైజారేదెచ్చేంపిల్లా ॥ఏలే॥
కర్నూలుపోతాంపిల్లా ♦ కమ్మలగొలుసులు దెచ్చేంపిల్లా ॥ఏలే॥
పల్నాడుపోతాంపిల్లా ♦ కొల్నాటిచీరెలుదెచ్చే పిల్లా ॥ఏలే॥
ఏలూరుపోతాంపిల్లా ♦ యేనైనదెచ్చేంపిల్లా ॥ఏలే॥

(అంతలో నావ మునుగుచున్నది నావలోనివారందరు గోలగా)

అందఱు—హా! చచ్చిపోతిమి. చచ్చిపోతిమి.

[ప్రవేశము: కొందరు పురజనులు]

అయ్యో! అయ్యో! మన చంద్రాంగద మహారాజెక్కిపోయెనీ నావ యమునాజలాంతరాళంబున మునిగిపోయెగదా?

మరికొందఱు— ఏదీ యెక్కడ మునిగినది యోడ? ఇపుడిక్కడనే యుండెనే? (చూచి) అయ్యో! నిజముగ మునిగిపోయెనే ఇంక ముందు కార్యాలోచనయేమి?

మరికొందరు—ఇకనేమియున్నది? మనరాజుగారికీవార్త దెలుపవలసినదే.

కొందరు—ఔనౌను మనమతిశీఘ్రమున రాజుగారికడకేగి సర్వముం దెలుపుదమురండు.

అందరు—జాగుసేయక రండుపోవుదము. నిష్క్రమింతురు.

యవనికజారును.

ద్వితీయరంగము—చిత్రవర్మయాస్థానము.

[ ప్రవేశము:-చిత్రవర్మ, సుగుణాకరుండు. ]

చిత్ర—సుగుణాకరా! చంద్రాంగదునిగురించి నాకుచాలగ దుశ్శకునంబులుబొడముచున్నవి. కారణమేమో తెలియదయ్యె. (దీనుండగును.)

సుగు—రాజేంద్రా! కులపర్వతంబులకన్న నమిత ధైర్యోపేతులగు మీరింతమాత్రముననే మనోవ్యసనముం దెదరేల? నిదానించి ధైర్యమూనుండు.

[ప్రవేశము:-పౌరులు]

(తొందరగ) రాజేంద్రా! ఒకమనవి.

చిత్ర—ఏమది? భీతావహులై తడంబడుచుంటిరి. నిదానించి విషయముందెల్పుడు.

పౌరు॥ కం. వారింబడగా నచ్చటి
వారందరి వారి దుఃఖ వారిధినంతక్
వారింపఁజాలకపు డ
వ్వారిం దిగనాడి మేమువచ్చితిమిటకున్

చిత్ర—అంతులేకుండగ వచించెదరేమి? కొంచము నిదానించి విశదముగ జెప్పుడు.

పౌరు తే.గీ॥ కనులగన్నంతదెల్పెద మనఘు యమున
యందు మీయల్లుఁడోడపై నచటిజనము
తోడ నెక్కియు వడిబోవఁదోరగల్లి
మునిగె నదియందు వారెల్ల ఘోరుమనిరి.
మహారాజా! మీరు శీఘ్రముగ లేచిరండు.

చిత్ర:- (తత్తరమున స్వ) ఆహా! యేమీ కాలమహిమ? (ప్ర) పౌరులారా! చంద్రాంగదుండెక్కినయోడ యమునయందు మగ్నంబయ్యెనా? అంతయుసత్యమా?

పౌరు:- దేవరవారిమ్రోల కేరడము బల్కుదుమా?

చిత్ర:- హా! చంద్రాంగదా!

మూర్ఛిల్లును
(యవనికజారును)

తృతీయరంగము యమునానది

[ప్రవేశము చిత్రవర్మ సుగుణాకరుఁడు పురజనులు]

చిత్ర:- పౌరులారా! యోడయెచ్చట మగ్నంబైనది?

పౌరు:- దేవా! యిచ్చటనే మగ్నమైనది.

చిత్ర:- (విషాదమున) హా! రాజపుత్రా! సచ్చరిత్రా! నిర్మలగాత్రా! శైలధీరా! సుకుమారా! సూర్యనిభతేజా! సత్కులప్రసూతా! మేమెంత పాపకర్మమొనర్చితిమో అయ్యీశ్వరుండు దయావిహీనుండై మనల నెంతలో నెడఁబాపెను? ఈవార్త నీతలిదండ్రుల కేనేమని తెలియనంపుదును? పున్నమచందురు నెన్నుడి చిన్నెలుగల నీముఖారవిందంబు నాకన్నుదమ్ములఁ జూడకున్న ని ధరిత్రీవలయంబుపై బ్రదికియున్న ఫలితంబేమి? యీధనధాన్యంబులేల? యీవైభవంబులేల? రాజ్యంబేల? రథగజతురగపదాతులేల హా! గుణభూషణా! రవి కులాభిసోమా? నిన్నెంతలో గోల్పోయితిని?

ఉ॥ భూతలనాథ! వైరుల సమూహము నొక్కని మేషమంతలో
భూతలమందుఁ గల్పఁగల పూర్ణభుజాబలమెల్ల నోడపై
నీతరి జూపలేవయితివే గనులంగనకుండ జేసెనా
పాతకి బ్రహ్మ నాసుతక వారిగ దుఃఖము దెచ్చిపెట్టెనే!
హా! చంద్రాంగదా! చంద్రాంగద!

తే.గీ॥ అస్మదీయ సభాస్థలమందు బ్రాహ్మ
ణాగ్రగణ్యుండు వచియించినట్టిమాట
తోడనే గూడివచ్చె నాతోడునీడ
యల్లుఁడా! యూహితోక్తి సిద్ధాంతమయ్యె.

తే.గీ॥ చెలులు చుట్టములును సహాయులునశించి
రక్కటా! నేనురాబోవునట్టి కీడు
నెరుఁగనైతిని జీవించు టెట్టులేను?
పూర్వజన్మ దుష్కృతమిప్డు పులిమెనహహ!

సుగు:- రాజేంద్రా! మీదుఃఖమునకుఁ దుదియెయ్యది? ఇదిగాక

తే.గీ॥ పుణ్యగతి హీనమును జేయఁ బూనునట్టి
వ్యసనమందిన ఫలమేమి వచ్చునయ్య?
సకలలోకమాన్యుఁడు నలచక్రవర్తి
పౌత్రునిగురించి చింతించ బ్రదుకఁబోనే?

మీరితరులవలె వగవఁజెల్లునా? శాంతివహించక జేయునది యేమీ?

చిత్ర:- అమాత్యవరా!

తే.గీ॥ వగవవలదన్న నామది వగపుబోనె?
కరము శోకాగ్నినన్ను దగ్ధంబుజేయఁ
జొచ్చె జీవించుటెట్లిందు జొత్తుఁ బ్రాణ
మిత్ర! జామాతనెడబాసి మెలగుటెట్లు?

హా! యింకేమిసేయుదును? తెరువెయ్యది? హా! చంద్రాంగదా!

సుగు:- రాజేంద్రా సర్వమెరిగిన మీరిట్లనఁదగునా?

ఉ॥ మేరుగిరీంద్ర మొక్కయెడ కులిసిస్థైర్యము దూలుగాని పెం
పార సుధీరవర్యులయినట్టి మహాత్ములు మీరుగాన యా
భూరమణుఁగురించి యిటుపొక్కట పోయినసీటికట్టయా
చారుచరిత్ర రాజులిలఁజూపుకు నింతదపింపఁబాడియే?

మీరిట్లేల విషాదమందెదరు? మీకాచంద్రాంగదుని గురించి జీవితకాలమువరకు పీడని దుఃఖమున్నది. కొంచెముధైర్యము వహించి రెండు పురంబుజేరుదము.

చిత్ర:- ఎచ్చటి ధైర్యము ఇంకెచ్చటిపురము.

సుగు:- రాజేంద్రమా! దుఃఖోపశమన మొనర్చుకొని రండుపోదము.

యవనికజారును.

## తురీయరంగము సీమంతినినగరు

(ప్రవేశము సీమంతిని దుర్గాంబ కనకాంబ)

దుర్గాం:- (మెల్లగ) కనకాంబా! యీమెకావార్త తెలయనట్లున్నదే;

సీమం:- దుర్గాంబా ఏమివార్తయది?

దుర్గాం:- అమ్మా! మేమేమని చెప్పుదుము (తలవంచుకొనును)

సీమం:- (స్వ) ఏదో యుపద్రవమునాకే పొసఁగినది కాదేని వీరునన్గని విషాదము సూచించనేల? (ప్ర) కనకాంబా! మీరిచటి కరు దెంచినదేలనో నిజముదెల్పవలెను సుమీ తప్పిననాయాన.

కన:- అమ్మా! నీమనోవల్లభుండు మంత్రిసామంతాది సపరివారంబుతో బాహ్యాగామవిహారంబు సల్పనెంచి తరలిపోయి యమునలో దరిమెక్కి జనుచుండ నదిమునింగెనట. యదికన్నులారగాంచిన పురజనులుకొందరు మీతండ్రిగారికి విన్నవింపఁదగు పరిజనంబుసమే తముగా నన్నదియందెల్లెడలఁ బరికించి వారిని గనఁజాలకపోయి రట. యీవార్త నీకుదెలియకున్నదాయని యూహించితిమి.

సీమం:- హా! దైవమా! (మూర్ఛిల్లును)

కన:- అయ్యో! సీమంతిని మూర్ఛిల్లినదే (లేవదీయును)

సీమం:- ఏమీ యీవిచిత్రము? ఇంతలోనింతపనిజరుగునా? కనకాంబా ఈయనుచితమగువార్త నెవ్వరిచేవింటిరి?

కన:- అమ్మా! ఒకరనియననేల? మనపురింగలవారెల్లరు రాజుగారి యల్లుఁడు యమునానదిలోఁ బడెనని మిగుల విషాదమందు చుండిరి.

సీమం:- (విషాదమున) హా! ప్రాణలోలా! కరుణాలవాల! శుభశీల! సద్గుణజాల! మిమ్మిప్పట్ల నెడబాసిన నాసుకుమారమగు శరీర మనుభవించుటెట్లు? మీరులేని నాబ్రతుకు పర్వతంబులపైఁ బూయు పుష్పంబులరీతి అడవిలోఁగాయు వెన్నెలరీతి తాలిమి లేని తపసిరీతి రూపయౌవ్వన సంపన్నతగల యజ్ఞానునిరీతి పరి మళంబులేని చందనంబురీతి చంద్రుఁడులేని రాత్రిరీతిగ నిష్ఫ లంబుగదా? హా? సచ్చరిత్రా! రమ్యగాత్రా! సరోజనేత్రా! నిషధరాజేంద్రపుత్రా! నీసుగుణగణ సంపదలెన్నియని మరతు. నీరూపంబు నెప్పుడు కన్నదమ్ములగాంతు? ఈ నిరంతర చింతా సంతాపంబు నికెట్లుసహింతు? అయ్యో! అంతకంత కంతము లేని యీవంత నెట్లుభరింతు? కట్టా! నిర్భాగ్యురాలనగు నాబోటి పాపికి వైభవంబులేల? దాసీజనంబులేల? యీపట్టున నాకట్టడి యగు బ్రహ్మకు నేనేలకండ్లబడితినో? యితరులఁజూడ నాతిని కనులకేమి కడగండ్లుగల్గెనో? మున్నెంత పాపమొనర్చితినో! పుడమిపైఁ బుట్టినదిమొదలు నాచేజేయఁబడిన పుణ్యకర్మంబు లేమూలడాగెనో? యింతలో నెంతమోసము చేకూడివచ్చినది. నేనేవిధిగా నీవియోగసాగరంబు దరిబట్టుదు? నికమీద నెట్లోర్చి యుందుదు? హా! దైవమా! యిపుడు మీకరకమలంబొసంగి నన్ను దరిజేర్చకున్నయెడ దురంతచింతాక్రాంత స్వాంతనై యి య్యిలపై నేను మనియున్న ఫలితంబేమిగలదు? మిమ్ముఁబోనాడిన యీశరీరంబు నాకేల? హా! యీశ్వరా!

సీ॥ కొంతకాలంబైన సంతోషముగనుండ
నూతనమగు నోము నోమనకట!
మందమాధుర్యమౌ మాటలు చెవులార
వినకున్న నేను జీవించనకట!
నీసేయు సేతలు నిక్షేపముగ నిట
నిండుగాఁ గన్నుల నుండెనకట!
మీఁబోఁటివారలు నాఁబోఁటి నిర్భాగ్య
రాలకు దక్కఁబోరరయ నకట!
తే॥గీ॥ దైవమెంతలో యూదండధరుపురంబు
నందుమిమ్ముంచె నేమని యందునకట!
వంతలోఁబడి నేనిట్లు బ్రతికియుంట
కన్నఁ జచ్చుట సుఖముగా నున్నదకట!

అక్కటా! మనోనాథా! నన్నునిక్కముగాఁ బాసిపోతివే! హా! దైవమా నన్నేలయింక జీవింపఁ జేసెదవు? కట్టా! ఇట్టిపాటుఁ నాకుఁ గలుగునని యొకనాడు దలంపనైతినే! దురంతసంతాపకరంబగు నయ్యో మునా సందర్శనాయత్తచిత్త మేలగల్గెను? హా! విధీ!

చ॥ పతినెడబాయు భామలకు బాంధవులేలను? భాగ్యమేల? స
త్సుతులఁగనేలఁ? బ్రాణములతో నిసుమంతవనేల? నెక్కటా
పతియెడబాసిపోయెఁ దరిబట్టగఁజాల వియోగసాగరం
బతికుపితుండు బ్రహ్మయిటు లారనిదుఃఖము దెచ్చిపెట్టెనే?
క॥ తక్కువనోములు నోమిన
యక్కొరగానికి మహాత్ముఁ జెట్టాదక్కన్
జక్కదనము జవ్వనముల్
బిక్కటిల్లంగ నేమి? బీటర్ బెట్టన్.

దుర్గా:—అమ్మా! నీవు తిని! మరణించిన నాథునికొఱకింతగ విచారమందెదవు కృశియించిన నామాలదైవమునకు దయారసంబుగల్గునా!

ఐనను నీకాగౌరీశ్వరులంద రండగానుండ నెట్టియిడుమలైన నెట్టుకొని పోక పట్టుగనట్టియుండునా? నీవిక చింతలుడుగుము.

సీమం:- చెలీ! దుర్గాంబా!

చ॥ పరువపు ప్రాయమున్ సొగసు పాయలుగాఁ జెనవేసికొంటిమో
వరమొడబాపె నిర్దయుతి వారిజగర్భుడదేమి పాపమో
పరువడి పూర్వకర్మమిట ప్రామగఁటూనె నదేమిచిత్రమో
హరహర! నిన్ననమ్మితిని స్వాంతమునందిట శేర్చ న్యాయమా?
తే.గీ॥ ఎన్నిజన్మములెత్తితినేని నాకు
నమలచారిత్రుఁడైన చంద్రాంగదాఖ్యుఁ
భర్తగాఁజేసి రక్షించు కర్తవంచు
డెందముననమ్మి పూజింతు నిందుమౌళి

కన:- అమ్మా! సీమంతినీ! పరితపింపకుము ధైర్యమే లక్ష్మి యను నది నీ వెరుంగవా?

సీమం:- అవునవును చింతించుటచే నిసుమంతైనను ఫలములేదుగాని ప్రియ వియోగాగ్నికీలలు దహించుచుండ నెట్లూరడిల్లుట? ఐనను విధికృతంబు తప్పదుగదా? (యవనిక జారును)

పంచమరంగము చిత్రవర్మయాస్థానము

[ప్రవేశము చిత్రవర్మ సుగుణాకరుఁడు సేవకుఁడు పౌరులు]

సుగు:- రాజచంద్రమా! వగవకుఁడు మనము చేయునదేమికలదు. అంతయు సర్వేశ్వరాజ్ఞగదా?

చిత్ర:- సుగుణాకరా! నీవెన్నివిధముల నన్నూరడించినను జామాత వియోగాగ్ని నన్నుదహించుచున్నది. యీదుండగమగు వార్త నయ్యింద్రసేన రాజేంద్రున కెట్లెరిగింతును? యేమనివిన్నవింతును నీవంశనాశన మొనర్చితినని చెల్పనా? హా! విధీ!

సుగు:- రాజేంద్రా! యీవార్త నెరింగింపకుండ నేమిచేసెదము? చంద్రాంగదునకేమైన మీరపకారమొనర్చితిరా? అంతయు దైవాధీనముగదా! నిషధపురీశునికీ వార్తనంపక తప్పదు.

చిత్ర:- అవును. సేవకా! అయ్యో! ఏమని తెలియనంపుదును?

సుగు:- సేవకా నీవు నిషధకు జని చంద్రాంగద్రావనీ దుగ్రంతు యమునా నదిపై విహరింపనేగి యందు మగ్నమయ్యెనని యింద్రసేన రాజేంద్రునకీ వార్తనెఱింగించిరమ్ము.

సేవ:- చిత్తము (స్వ) కట్టా యీవార్త నిషధాధిపతి కెవ్విధిగా దెల్పుదును. నోరెట్లాడును తప్పదుగదా? (నిష్క్రమించును)

సుగు:- రాజేంద్రా! గతించినవారికై కుందిక్షోభించిన ఫలముగలదా? ముందు కార్యాలోచనఁ జేయవలెను. చింతనుండి మనమునూ మరల్పుఁడు.

చిత్ర:— విషాదాగ్ని గాల్చుటచే నేమియుందోచుట లేదు. లోకమెల్ల నంధకార బంధురమై గన్పట్టుచున్నది. హా! చంద్రాంగదా! మమ్మేమి జేసిపోయితివి? మాయట్టి వతిహీనులకు నీ వేలలభింతువు? ముక్కుపచ్చలారని నా ముద్దుబిడ్డ నిరూఢాంగలక్ష్మిని సీమంతినీమణిని నీ పట్టమహిషినివీడి స్వర్గపురమలంకరించితివా? అయ్యో! ఒక్కనాడైన నిటిమంజగముజమెగునని కలనైన దలంపనైతినే? ఆ పాపిష్టియోడ నర్యమునయందు నీకొరకై యీ ప్రస్తుతనిర్మించెనా? ఓపాపీ! యమునా! నాయల్లునిదిక్కులేనుగను మహాపాపమానైతివే? కులనాశనమొనర్చితివే? మొనలేని దుఃఖమునముంచితివే? యీవిషాదార్ణవ మేనాడ్కి నీదుదును? యింక నేదేతిజీవించగల్గుదును? నిషధాధిపతి యింద్రసేనరాజేంద్రుని మోమెట్లుజూతును? యేమని వూరడింతును? యేమని వూరుబల్కుదును? నీకు మారుని మృతిచెందెనని బల్కనా? హా! జామాతా! చంద్రాంగదా! చంద్రాంగద... (మూర్ఛిల్లును.)

సుగు:— కట్టా! రాజేంద్రుని దుఃఖమునకంతు లేకున్నదిగదా?

(విసరుచుండ యవనిక జారును.)

—:o:—

షష్టరంగము—నిషధలో ఇంద్రసేనుని యాస్థానము.

...:o:...

[ ప్రవేశము:- ఇంద్రసేనుఁడు, ధీమంతుఁడు. ]

ఇంద్ర:- ఆ॥ వె॥ మంత్రివర్య! నాదు మానసంబిప్పుడు
కలకలంబునొందెఁ గారణంబ
దేమొ దోచకుండె నేమొకో యనియెంచ
వశముగాదు దెల్ప వశముగాదు.

ధీమం:- రాజేంద్రా! కుంభినీధవులెప్పుడు రాజ్యాంగభారమువహించు కతన నట్లనేయుండుటఁగలదు. గాని వేరొండుగాదు.

ఇంద్ర:- ధీమంతా! రాజ్యాంగవిషయమై నిసుమంతయేనియు చింత లేదు గాని చంద్రాంగదునిగూర్చి నాకు చాలగ దుశ్శకునంబులు బొడసూపుచున్నవి. నాడాతడు చిత్రవర్మధాత్రీశు పట్టణంబునకరిగినది మొదలు నచటి శుభస్థితులు దెలియవయ్యె. మీద దైవసంకల్ప మెటులనుండెనో.

ధీమం:- ఉ॥ చింతిలనేల? భూపకులశేఖర! నా మొరనాలకించి మీ
స్వాంతముగల్గసేకు డోకసంగతిఁ దెల్పెదనయ్య! మీసుతుం
డంతకునైన లెక్కగొనన ట్టి మహామహిముండు వానికే
వంతలు రావు వచ్చినను భారముగావవి బాధపెట్టఁగన్.

ఇంద్రసేనసార్వభౌమా! చంద్రాంగదునకేయుపద్రవము రానేరదు.

ఇంద్ర:- ఎందువలన?

ధీమం:- దేవా! అమ్మహాత్ముండు సత్యసంధుండు-శాంతమూర్తి-అమిత ధర్మాసక్తుండునగుకతంబున నెట్టియిడుములుబొడమినను గడుసు తనముకిడి పరుగిడనున్నాని పైకిరాఁజాలవు, మీరాక సుతునిఁగూర్చి సంశయింపవలదు.

ఇంద్ర—దైవసంకల్పంబునకు వికల్పంబు గల్గనేరదు. ఐనను (చింతించి) చేయునదేమిగలదు ?

(ప్రవేశము సేవకుడు)

సేవ—దేవా! చిత్రవర్మ రాజేంద్రుడనుపున నొక సేవకుడరుదెంచి తమ్ము దర్శింప వేచియున్నాడు.

ఇంద్ర—ఓరీ వాని శీఘ్రముగ దోడ్కొనిరమ్ము.

సేవ—చిత్తము (నిష్క్రమించును)

ఇంద్ర—మంత్రిసత్తమా! వీనిరాక యేమయ్యుండును ?

ధీమం—అంతయు నొక్కక్షణములోన దేవరవారికివిశదమగునుగదా

(పునఃప్రవేశము సేవకుడు సేవకునితో)

సేవ—దేవా ! వందనములు.

ఇంద్ర—ఓరీ ! రాజధానియందు విశేషములేమి అందరకు క్షేమమే గదా ?

సేవ-తే॥గీ॥ యింద్రసేనమహారాజ యిపుడునన్ను
జిత్రవర్మానుపుడొక చిన్నివార్త
దెల్పిరమ్మని యిటకంపె దెల్లమిగను
అయ్యయో ! మీకుదెల్ప నోరాడదయ్యె

ఇంద్ర—(తత్తరపాటున) ధీమంతా ! వింటివా వీనిమాటలు?

ధీమం—చిత్తము.

ఇంద్ర—కారణంబెద్దియో నాకు భయంబును తొందరయును గల్గుచున్నది.

ధీమం—రాజేంద్రా ! శాంతింపుడు. ధైర్యమూనుడు. సేవకా ! చిత్రవర్మనరేంద్రుని పురిగల వార్తలేమి? వాకేయుదెల్పుడుబంపిరి?

సేవ—ఏమియున్నవి. తెల్పుటకు నోటనోట మాటమాట రాకున్నది?

ఇంద్ర—ధీమంతా! నామదియందుండినట్లే జరిగినట్లున్నది. సేవకా! నిజము దెల్పుమా.

సేవ—(నేలంజూచుచు)

తే॥ గీ॥ అధిప! దనమంత్రి సామంతులాది సపరి
వార సహితంబుగాఁ గడుభారమైన
యోడ యొకటెక్కిపోయెడు వేళ విధివ
శంబుచే నదియందు మగ్నంబుజెందె.

ఇంద్ర—ఆయోడ యెవ్వరిది?

సేవ—చంద్రాంగద మహారాజెక్కిపోయెడిది.

ఇంద్ర—మగ్నమైన దెచ్చట?

సేవ—ఆయమునయందుననే.

ఇంద్ర—హా! కుమారా! చంద్రాంగదా! (మూర్ఛిల్లును)

ధీమం—(ఇంద్రసేనుంబట్టి సవరించి విసరుచుండును)

ఇంద్ర—(లేచి) హా! కుమారరత్నమా! నామనోభీష్టమా! పరిపూర్ణ భోగమా! నేనెంతబుద్ధిహీనుండనైతిని? అక్కటా! తండ్రీ! నిన్న జిత్రవర్మమహారాజు గృహంబునకంపక మాననైతినే? పైని నీవార్త విచారించనైతినే! నిన్న దిరుగ నస్మదీయ గృహంబునకుఁ బిలుపించుకొననీక నజ్ఞానమ్ము గ్రమ్మఁజేసిన నా పూర్వజన్మ దుష్కృత ఫలితంబు నెంతని దూషింతును? నైహికాముష్మిక సుఖంబు లొసగఁజాలిన నీబోటి సుగుణ సంపత్తిగల గారాబు కుమారుఁడు నాబోటి మందభాగ్యునకేల దక్కును? హా! దైవమా! ఈదుర్భరంబగు పుత్రశోకాగ్ని

జ్వాలలు నాధైర్య భూరుహంబును మొదలంటఁ గాల్చుచుండఁ గానే? ఏమి సేయుదును? అకటా! నీవంటి ముద్దుపట్టి లేని నాకీ రాజ్యవిభవం బేల? వాహనాద్యాయుధంబు లేల? సపరివారంబు లేల? భాగ్యభోగంబు లేల? తలిదండ్రుల నెప్పుడును సంతోషవార్ధి నోలలాడించు వారలు కుమారులు గారా? అయ్యో! నాచిన్నియన్నా! యిపుడు నాకనుదమ్ముల గట్టినట్లుంటివే? హా! చంద్రాంగదా! చంద్రాంగద! చిత్రవర్మ చనిపోవ నకటా నీ మాధుర్యమేల నాకు గల్గెను? నిన్నతడాహ్వానించినపుడు వలదని వారింపనైతినే? యిల్లు నిండిన గారాబుకొమరుని నిట్లు గోల్పోతినే? వంశనాశనమొనర్చుకొంటినే? తండ్రీ! నీపాల చిత్రవర్మ మహామారియయ్యెనే? అన్నన్నా! నాకీశోకభరంబెట్లు బుత్తును? నెవ్వరగని కుమారాగారుని బిలతును? ఇంకెవ్వరు నాకు సంతసంబొనగూర్తురు? వచ్చువారమున నిన్ను పట్టాభిషిక్తుఁ జేయ నెంచితినే? అయ్యో! యమునానదియే నీకు పాలించు పట్టాభిషేకమయ్యెనా? ఆహా! యింక నాజీవితమెట్లు?

సీ॥ నాపుత్రరత్నమా! నాపూర్వపుణ్యమా!
నాభాగ్యభోగ్యమా! నాఘనమ్మ
నాధననిధానమా! నాదానిక్షేపమా!
నన్నేలుసత్వమా! నావరమ్ము
నాపాలిసౌఖ్యమా! నాదుసంతోషమా!
నాకువైకుంఠమా! నాగుణమ్మ
నాదుసామ్రాజ్యమా! నాదుసంతానమా!
నాదుసుజ్ఞానమా! నామనమ్మ

తే॥ గీ॥ అంతకంతకు దుఃఖాబ్ధి యుడికిగమ్మ
మిత్తి గొనియుంగ బ్రదుకుట కేనిపొమ్మ

యింక నిను గనుఁగొనకున్న నీక్షణమ్ము
మెన్నివిధముల దశలున్న నున్నసుమ్ము.

హా! దైవమా! ఎట్టిచెడుకాలము చేకూరివచ్చినది?

ఉ॥ అక్కటా! కష్టకాలమున కాంతునమైతి మదిందపించితిన్
రెక్కలులేని పక్షిరథురీతిని కాంతివిహీనమందితిన్
బెక్కువగం గృశించితి వివేకము గోతికి నప్పగించితిన్
దిక్కొకగిలేనివాఁడనయితిం గొఱమాలిన జన్మమె త్తితిన్.

తే॥ గీ॥ పమ్మినటువంటి దుఃఖానలమ్ము నన్ను
గాల్చుచున్నను మరణంబు గాంచనైతి
పలువిధంబుల మూర్ఛిల్లి బ్రతికినాఁడ
నేమిసేయుదు? విధివ్రాతకింక మీఁద.

భీమం—ఇంద్రసేనరాజేంద్రా!

తే॥ గీ॥ మిమ్ముబోలిన శాంతచిత్తమ్ముగల్గి
నట్టివారలు సుస్థిరంబైనదాని
బూనకను నస్థిరంబైనదానిఁ బూని
చింతనందరు మరి బుద్ధిమంతులనఘ!

పూర్వజన్మ సుకృత దుష్కృతంబులచే సుఖదుఃఖంబులు సంప్రాప్తమగుచుండును. ఐనను వీనికొఱకు మీరంతగఁ జింతనందదగదు. ఏలనన?

తే॥ గీ॥ కృతయుగంబును మాంధాతృఁడేలినాఁడు
త్రేత శ్రీరాముఁడేలె వఖ్యాతిదనర
ద్వాపరంబును సద్ధర్మభూపుఁడేలె
వారలేమైరి? మనమెంతవారమరయ?

రాజేంద్రా! బ్రహ్మపదప్రాప్తికిఁదగిన మీరే యిట్లు చింతించ మాబోంట్లింత పరితపించవలెను? మీదటనైన మీరలు ధైర్య మగాని దుఃఖోపశమన మొనర్చుకొనుఁడు,

ఇంద్ర:- నిజము. పుత్రమిత్రకళత్రాది సంబంధబాంధవ్యముచే లోక మెల్ల మోహాంధకార మునముంచి మానవులనెల్ల బొమ్మలకైవడి నాడించుచున్నదిగదా! యేమీ కలిమహాత్మ్యము?

తే॥ గీ॥ సారమిసుమింతలేని సంసారవార్ధి
యందు మగ్నతచేనది యాస్థిరంబ
టంచు దెలియక వెంగలినైదపించి
నాడ క్షణభంగురమటని జూడఁడో౽.

హా! శంకరా! భక్తవశంకరా! మీరిన ఘోరాకారంబగు సంతాపకూపారంబునంబడి గుందుటకంటె మీపదారవింద చింతనానురక్తుండనై మోక్షమార్గమందు దీక్షబూనుటొక తెల్వి యగదా? అట్టి సుజ్ఞానమునందు మనంబు జొరనీక కానంతి యజ్ఞానంబున న్వచించ వెన్వెంటవచ్చు నటుల జేసిన విధివ్రాత కేమిసేయుదును! హా! యీశ్వరా! పరమేశ్వరా! నీకన్న నా కెవ్వరుదిక్కు? నన్నుద్ధరింపుడని దోసిలొగ్గితిని. నన్నెట్లుబ్రోచెదవో నీయాజ్ఞానువర్తిని. కాగల కార్యమయినది. యింకనేమి యున్నది? నిండమునిగిన చలియుండదుగదా! హా! కాలమా! ఎంతవింత ?

(యవనికజారును)



షష్ఠరంగము — నిషధలో భీమబలుని యాస్థానము.

[ప్రవేశము:- భీమబలుఁడు ధైర్యవంతుఁడు దండకరుఁడు]

భీమ:- ధైర్యవంతా! పుత్రశోకాగ్ని కీలలఁగాలుచున్న యింద్రసేనని బట్టి కట్టిమనయిచ్చకేర రాజ్యపరిపాలన జేయుట కిదియే మంచి

సమయము. నేటికి నామనోరథమీడేరినది. జాగుసేయక నా తనిబట్టి నిర్బంధించవలయును.

ధైర్య:- చిత్తము తమశాసనం బతిక్రమించ నెంతవారము? అదెంతటి పని. దండకరా! సేనానింగూడి యింద్రసేనుని నిర్బంధించి శీఘ్రము దేవలయుపొమ్ము.

దండ:- చిత్తము. (నిష్క్రమించును.)

భీమ:- ధైర్యవంతా! మనదాయయగు నింద్రసేనుని తొలుత కారాగారవాసునింజేసి పిమ్మట రాజ్యపాలన ముప్రక్రమించవలెను.

దండ:- చిత్తము. తమయిాప్సితమే నాయిాప్సితము.

[పునఃప్రవేశము దండకరుడు యింద్రసేనునితో]

భీమ:- ఇంద్రసేనా! గర్వముచే విర్రవీగుచుంటివిగదా నాటి నీగర్వమేమయ్యెను? నేటినుండియు నీవు మాయాజ్ఞానువర్తిగ నుండవలెను.

ఇంద్ర:- సోదరా! మీకెన్నడేని యపకార మొనర్చితినా? నీమొక సర్వకాలము సోదరవాత్సల్యముంచుట నీవెఱుంగవే ?

భీమ:- ఔనౌను. నీసోదరవాత్సల్యము వెల్లివెరిసి పారుచున్నది. ఇంద్రసేనా! మరచితివా మమ్మెంతయో సంకటమొందించినవాడవు గాదా? ఛీ దురాత్మా! నీమోము జూడంజనదు. నీయట్టి కలుషాత్ముఁడీ లోకమునంగలడా ? దండకరా! వీని కారాగృహావాసునింజేయుము. పొమ్ము.

దండ:- చిత్తము. రాజాజ్ఞ పోదమురండు.

ఇంద్ర:- ఆహా! కాలమా! ఎట్టిమార్పులఁ దెచ్చితివి? నిషధాధిపతి పుత్రవియోగమున కుందికృశించుతరి నీ కారాగృహావాసము గూడనా? దైవమా! నాపాల నెట్టిదుర్దినము చేకూర్చితివి! అంతయు నీపేరితముగదా? దండకరా! రాజాజ్ఞ నెరవేర్పుము.

దండ:- రండుపోవుదము. ఇద్దరు నిష్క్రమింతురు.

భీమ:- ధైర్యవంతా! యీక్షణమునుండియే మనరాచరికము సాగించు కొనవలెను, గాన యింద్రసేనుని బందీకృతుని గావించితిమని పతాకమెత్తించుము పురమెల్ల నీవాఱ ప్రకటింపుము.
ధైర్య:- చిత్తము శలవొనంగుడు తత్ప్రయత్నమున నుండెద.
భీమ:- మంచిది. నేనునువచ్చెద రమ్ము.

(నిష్క్రమింతురు)

యవనికబజారును

సప్తమరంగము—— కారాగృహము.

[ప్రవేశము:- ఇంద్రసేనుఁడు] (విషాదమున)

అయ్యో! నాగ్రహచారమా! ఎట్టి కార్యమాచరించితివి?

ఉ. మానితరాజ్యలక్ష్మి యసమానుల పాల్బడనాయె, బెక్కుగా
దీనతబొందనాయె నగధీరులు మత్ప్రియులెల్లవైరులై
కానఁగ రాకఁబోయిరికఁ గన్నులగప్పకొనందలంచు నా
సూనుఁడుబోయె సర్వమునుజూడఁగ హీనపుజన్మగాల్పనా ?

కం. కృపణుఁడనై యన్యుల స
త్కృపకుంబాత్రుండ నగుట నెంతటిపని పా
పపువిధి యీక్షణమందున
గృపహీనుండగుచునిట్టి కీడులుఁబెట్టెన్.

అయ్యో! ఏమినాగతి తుదకు దిక్కుమాలినవాడనైతినే!

సీ. ప్రారబ్ధకర్మమా! పట్టిబాధించె గా
నాసేయుపుణ్యంబు నాశమయ్యె
నాశమైనంతనే నాసుతు నెడవాసి
వంతకులోఁబడ వలసెనయ్యొ
వంతకులోఁబడ్డ యంతలో బాంధవుల్
గట్టిగా రెక్కలు గట్టిరయ్యొ
రెక్కలుగట్టి యీ పృథ్వీతలంబెల్ల
నిచ్చదిరగనేల నెంచిరయ్యొ

తే॥ గీ॥ అక్కటక్కట! కలకాల మొక్కరీతి
నెంతవారికి జరుగద నెడిసునీతి
వెంటనేనాకు జెల్లెనవ్విధికృతంబు
దప్పితిరిగెద మనుమాట తప్పిదంబు.

ఆహా! రాజ్యలక్ష్మీ! నీవు చంచలచిత్తవను మాట నేటికి సిద్ధాంతమైనదిగదా? సర్వముం గోల్పోయితిని—కారాగృహవాసుండ నైతిని—నిద్రాహారంబులకుం దూరుండ నైతిని—బంధువులకుఁ బగవాఁడ నైతిని—యిట్టి నేను కారాగృహమందుంటయే శ్రేయమని దోచుచున్నయది. ఏలనన, మీాద నిశ్చలస్వాంతుండనై పరమార్థ విచారణజేసి బాహ్య ప్రపంచ సంబంధము విడచి సుఖముగా నుండనోమితిని—ఆహా! తను వునకు బడలికహెచ్చి నిద్రాదేవి నాపై తాండవమాడుచున్నయది. కొంచము శ్రమదీర శయనించి పిమ్మట వృథాకాలయాపనంజేయక బ్రహ్మపద ప్రాప్తినందఁదగిన ప్రయత్నము జేసి కృతార్థుండ నయ్యెదగాక,

[ పరుండి వెంటనే లేచి ]

ఈ కారాగృహమందైన సుఖముగ నుండనోచనైతినే! అయ్యో! యేమీా నాయీా యవస్థ?

సీ. కందిరీగలరీతిగా శరీరముఁమీాదఁ
బడి మశకావళి పటిమఁజూప
కొల్లకొల్లగమూగి నల్లులు చెలరేఁగి
వృశ్చికంబులు గుట్టు విధినిబోఁడు వ
మరిగానుబడక గోమారుల గమిగందు
జలగలవలెఁబట్టి చొకళింప
సింగమేనుగుపైకి చెంగున దుముకు వి
ధమున గుట్టఁగ మక్షికములుఁవాల

తే॥ గీ॥ నిదుర రాజాల దిచ్చట నిలువఁజాల
నాకటికి నోర్వఁగాఁజాల నధికలీలఁ
జెలగు దేవేశ భీముఁడన్నిన్ని బాలు
చేతఁ జెరసాలలో నుండఁజేసె ధాత.

అయ్యో! దైవమా! ఏలయీలీల జాలిలేక నలజడిపాలొనర్చెదవు? ప్రజల బిడ్డలవలెఁ గాపాడు నీ యింద్రసేనున కింతటి శ్రమ జేకూర్చుట నీకేటిన్యాయము? యెన్నడైనా నొరుల కావంత హాని యొనర్చి యెరుంగనే. అట్టి వానికిట్టి కట్టడి కాలము జేకూర్చితివా? నాముద్దుకుర్రని నాహూవశిష్టుని జేసితివి. రాజ్య భ్రష్టుని జేసితివి. కారాగృహ మందుంచితివి. మిత్రులనెల్ల శత్రులం జేసితివి. అనన్నా! కాఁగలకార్యము లన్నియు కాఁజేసితివి. తుదకు నన్నేకాకినిగ జేసితివి. ఈకారాగృహమందైన సౌఖ్యముగ నుండనీయక శ్రమల పాలొనర్చితివి. ఎనలేని దుఃఖమ్మున ముంచితివి. ఇట్లు మనఁజేయుటకన్న జీవములఁ బాపజేసిన సౌఖ్యమందుదునుగ దా ? ఈశా! నన్ను నీసన్నిధానమునకుం జేర్చుకొనుము. నా కష్టములు గట్టెక్కింపుము. తుదకు నాజీవితము భూభరంబయ్యెగదా? హా!

(మూర్ఛిల్లును)

(యవనిక జారును.)

---

అష్టమరంగము—చిత్రవర్మ యాస్థానము

[ ప్రవేశము: చిత్రవర్మ, సుగుణాకరుఁడు ]

చిత్ర—సుగుణాకరా! కాఁగల కార్యమైనది గదా? యింకఁ జేయు కార్యమేమి ?

[ ప్రవేశము: సేవకుఁడు ]

సేవ—రాజచంద్రమా! వందనములు.

చిత్ర—ఓహో! నిషిధపురి విశేషము లేమి ?

సేవ—దేవా! ఏమనివిన్నవింతును? నేనింద్రసేన రాజేంద్రుని దర్శించి యీయనుచితమగు వార్తనుగ్గడించు నంతలో—

తే॥ గీ॥ సుతునివార్తను విని చాల శోకచిత్తు
డైన యయ్యింద్రసేన దాయాదులంద
రమ్మహాత్ముని బట్టి రాజ్యంబు గొనుట
లాయెఁ గారాగృహ ప్రాప్తమాయె నకట!

చిత్ర—శివశివ యెట్టి కర్ణకఠోరమగువార్త నాలింపనాయెను? ఇంద్ర భోగ మనుభవించు యింద్రసేన రాజేంద్రుఁడు సూనునిఁగోల్పోవుటయగాక రాజ్యలక్ష్మి నెడబాయుటయు, కారాగార వాసుఁడు నాయెనా? హా! దైవమా! మాపాల నెట్టి చెడు కాలము చేకూరి వచ్చినది? నలసార్వభౌమా! నీవంశము నీపౌత్రునితో నంత మొందించితివా? ఇంద్రసేనసార్వభౌమా! రాజాధిరాజులు నీకు దాసానదాసులై మెలంగ సురనాథుని కన్న మిన్నగ రాచరికంబుసేయు నీకు క్రూరులగు స్వవంశీయులచే నుడుపరాని కస్తి గల్గినదా? అన్నన్నా! ఎంతఘోరము? ఎంత దుండగము? ఎంతమాయదారి తనము? ఔరా! కాలమా! సుగుణాకరా! ఇఁక నా చంద్రాంగదున కుత్తర క్రియలు జేయువారెవ్వరుండిరి? హా! చంద్రాంగదా! చంద్రాంగద.

సుగు—దేవా! ఎవ్వరుండిరి? సర్వమునకు మీరలే కర్తలు.

చిత్ర—చంద్రాంగదున కుత్తరక్రియలు నిర్వర్తించి సీమంతినికి మన సనాతన ధర్మానుసారముగ కర్మకాండ జరుపవలెనుగదా? హా! తుదకెట్టి దుస్థితి చేకూడినది? హా! చంద్రాంగదా! చంద్రాంగద! సుగుణాకరా! యింక జాగుసేయఁ దగదు. ఈ రోజుననే మనము దలంచిన కార్యము నెరవేర్ప వలెను. పోదము రమ్ము. (లేచి కొంతదూరము నడచి) హా! దైవమా! క్రూరకృత్యంబున కొడిగట్టితివే? కులనాశన మొనర్చితివే?

శ్రీ

# సీమంతిని

## తురీయాంకము

ప్రథమరంగము : పాతాళలోకములో కొలను.

ప్రవేశము : రత్నాంగి, కోమలాంగి, కనకాంగి, శోభనాంగి, చంద్రాంగదుడు ఒకవైపున.

శోభ—రత్నాంగీ! జలక్రీడాభిరామమున్న తరుణీజనంబునకు హర్షదాయకముగదా?

రత్నాం—ఔను (ఒకవైపునకుజూచి)

ఉ॥ ఓచపలాక్షులార! యిపుడొయ్యన నితని దిక్కుఁజూచి బల్
యోచన జేయుడీరలు మహోన్నతితోడఁ బరీక్ష సేయగా
రాచకుమారుడంచు మదిరంజిల నాతని చెంతకేగి యే
దో చతురోక్తిచే నిజము దూర్ణముగాఁ దగఁదీసి వత్తమే?

ఈసన్నుతాంగుఁడెవఁడో మనలఁగూడి జలక్రీడ లాడవచ్చినట్లు దోచుచున్నది.

శోభ—(చూచి) నిజముగా నట్లేయున్నది.

కోమ—ఆహా! ఏమీ వీనిరూపము? ఏమీ వీనిపాదయుగము? ఏమీ వీనివిలాసము? ఏమీ వీని నీటు? ఏమీ వీనిగోటు? చూడఁజూడ నత్యద్భుతంబుగా నుండుటయేగాక వీనివదలిపో నిష్టంబు లేకున్నది. ముందు కార్యాలోచనఁ జేయుడి?

కన—ఈతని మన ప్రభువగు పన్నగేశ్వరు చెంతఁజేర్చు టుచితమని నాయిాప్సితము.

అందఱు—అట్లనే జేయుదము.

(చంద్రాంగదుని సమీపించి)

ఓయీ! మేము జలక్రీడలాడుతరి నొక చోరునిరీతి నీవేల వచ్చితి? నీవెవ్వఁడవు?

చంద్రాంగదుఁడు తలవంచి నిరుత్తరుండగును)

శోభ—నిజము జెప్పదవా లేదా? స్త్రీజనంబులకడ కొంటరిగ సాహసించి పురుషులు రాఁజెల్లునా? యింతమాత్ర మెరుంగవా?

(చంద్రాంగదుఁడు నిరుత్తరుండయి వెళ్ళోవలఁబోవును)

శోభ—నిజముగ్గడించువరకు నిన్ను విడుచుటకల్ల. ఏమి! నాగలోకమనినను నాగకన్యకలనినను నీకుఁజుల్కనగఁ దోచినదా? తృణప్రాయముగ మేము దృగ్గోచరమైతిమా? ఏమీ నీసాహసము? ఏమీ నీధైర్యము? మాలోకము జేర మానవమాత్రునకు సాధ్యమగునా? చేరనేపో యిట్లు స్త్రీలకడకు రా సాహసించునా? నీవెవ్వడవు? తొలుత జెప్పుము.

(చేయిబట్టుకొని లాగును)

ఆపైని నీపనిఁబట్టించెదము. అన్నన్నా! ఎంతచోరుఁడవు?

రత్నా—శోభనాంగీ!

క॥ ఇప్పగిదిఁ బెనఁగులాడకు
మిప్పృథివీశ్వర కుమారు నెంతో హర్షం
బుప్పతిలఁ దోడుకొని మన
మప్పన్నగ వర్యుజెంత కరుగుదమింకన్.

శోభ—అట్లనే పోవుదమురండు. ఓయీ! రమ్ము పోవుదము.

నిష్క్రమింతురు.

యవనిక జారును.

ద్వితీయరంగము : పాతాళలోకములో తక్షకుని యాస్థానము.

ప్రవేశము : తక్షకుఁడు, మేఘవాహనుఁడు, శంఖుఁడు, కోకిలాక్షుఁడు, సుకుమారుఁడు.

తక్ష—మేఘవాహనా! జరామరణ హితంబగు నీరసాతలంబున కీడగు లోకమెందైన గలదా?

మేఘ—తమవంటి సదయహృదయుల పాలనకు లోనయిన యీనాగ లోకమునకుసాటి నెందును లేదని నిశ్చయముగాఁ జెప్పగలను.

తక్ష—ఎల్లరు నతిసంభ్రమాయత్తచిత్తులై యుండిరిగదా?

మేఘ—మన లోకులెల్లరు రాజభక్తిపరాయణులై సత్యమార్గ మనుసరించియే యుండిరి.

తక్ష—అదియే ముదావహము.

మేఘ—చిత్తము.

[పునఃప్రవేశము: నాగకన్యలు చంద్రాంగదునితో]

అందరు—రాజేంద్రా! వందనములు.

తక్ష—జయమగుగాక. (చంద్రాంగదునిఁజూచి సంతసమున) శోభనాంగీ !

కం. ఈరాకుమారుఁ డెవ్వఁడొ
ధీరతఁ దలిదండ్రులెవరొ తేటగ నేలే
ధారుణియెయ్యదొ యీతని
మీరిటు దెచ్చిన విధంబు మెలుకువఁజెపుడీ.

శోభ—ఆ, వె. పన్నగేంద్ర నిజము విన్నవించెదమిక
యమునలోనఁ గ్రీడ లాడుచుండు
సమయమం దితండు సరసకువచ్చిన
దెచ్చియుంచినార మిచ్చటికిని.

ఈసన్నుతాంగుని మాకన్నులఁగని మీసన్నిధికి తెచ్చితిమిగాని, నిశ్చయముగ నీతనివృత్తాంతము విమర్శించ మైతిమి.

తక్ష—విచారించెదఁగాక! మీరు పొండు.

నాగకన్యలు నిష్క్రమింతురు.

చంద్రా—పన్నగేంద్రా! వందనములు.

తక్ష—శుభమగుగాక! యిందు గూర్చుండుము.

చంద్రాం—(కూర్చుని)

ఆ. వె. భోగికులశశాంక! భోగిభూషణునకు
భోగిశయనునకును పోరుకూటి
తిండిబోతుతండ్రి మెండుగా దమకీర్తిఁ
బొగడఁజాలరెంత బొగడనేను.

తక్ష—కుమారా! భీతినొందకుము, నీవిచ్చటికేలవచ్చితివి? నీ వెవని సూనుండవు? నీకులగోత్రనామంబులేమి? సత్యముబల్కుము.

చంద్రా—చిత్తము.

రగడ

వినుపన్నగవర! వినుపించెదనిక
ననువుగఁ బొగడిక లందినదిద్ధర
నిషధదేశమును నిపుణత నేలెడి
యసమబలుండ త్యాగశీలుఁడగు నల
చక్రవర్తి సంజనితులలో ఘన
విక్రముఁడబ్ధి గభీరుం డుగ్ర కు
మారుఁడు మారుని మారునట్టి సుకు
మారుఁడు సద్గుణ మానితుఁడనఁదగు.

నింద్రసేన రాజేంద్రుని పుత్రుఁడఁ
జంద్రాంగదుడన సన్నుతికెక్కియు
శ్వశురాలయమున సరసము మీరఁగ
శశిముఖనాదగు సతితోనుండియు
నొకదినమున బాహ్యోద్యానమునకు
సకలంకులమై యవుడొక తరిపై
నెక్కి యమునలో నింపుగఁ దిరుగుచుఁ
జక్కగ నుండిన సమయంబున విధి
వశమునఁ గలమ వ్వారిలో మునిఁగిన
గుశలచిత్తులీ కోమల గాత్రులు
నను గన్నులఁగని నవ్వుచు వేగమె
కొనివచ్చిరి మీకొల్వునకిప్పుడు.

ఉ॥ పన్నగనాథ! నీదయకుఁ బాత్రుఁడ నా మొరలాలకించుమీ
సన్నుతినంతగా సలుపఁజాలను దీనజనావనప్రియా!
పన్నుగఁ బూర్వజన్మమునఁ బాటిలు పుణ్యములెన్నొ జేయఁగాఁ
గన్నన మీపదాబ్జములఁ గంటిని పాపవినాశ! నేనిటన్.

తక్ష—(సంతసమున) రాజనందనా! నీసచ్చరిత్రం బెంతని పొగడుదు? నీవు పిన్నవాఁడవైనను బుద్ధి పెద్దదియగు కతంబునఁజాల సంత సించితిని. నీవిసుమంతయైన సంశయింపక మనోవాక్కాయ శుద్ధిగ నీవే దైవము నారాధింతువు? సత్యముగ్గడింపుము.

చంద్రా—

కం. ఉరగేంద్ర! యీజగంబుల
కిరవుగ నెవఁడీశ్వరుండొ హితవుగ మాకా
పరమేశుఁడు పూజ్యుండౌ
నర మర నికనేల? నన్మదాత్మ ముదమునన్.

కం. ఏదేవుఁ డమరులందు మ
హాదేవుండనఁగ నొప్పు నాగారీశుఁ
వేదాంత వేద్యు! నీశుని
మోదముతో భక్తిభావమునఁ బూజింతుఁ

కం. ప్రకృతి వికృతులం గల్గిన
ప్రకటిత షోడశవికార బలముబెరసి దాఁ
బ్రకృతిఁ విక్రృతింబొందక
సకలము దానై వెలుంగు శంభునిఁదలఁతుఁ.

ఆ, వె. కనఁగ వినఁగ నలవిగానట్టి బుద్ధి దీ
పంబు రూపురీతిఁ బరగఁదోచు
నట్టి యాదిమధ్య మంత్య హీనుండగు
వాని నాశ్రయించు వాఁడనయ్య!

కం. తొమ్మిది ద్వారమ్ముల నగ
రమ్మున వెలుగొందు హంస రాజేశ్వరు ని
త్యమ్మొడబాయక వేడుక
సమ్మతిభజియించువాఁడ సదమలచరితా!

తే, గీ. సర్వమందున దానయి సర్వము దన
యందు నిమిడించుకొని లోకమంత నీటి
మయముగాఁజేసి తాఁదాని మధ్యయోగ
నిద్రజెందిన పరశివునిందలంతు.

అహికులశేంద్రా! యింతకన్న దైవమెందుగలఁడు? వేరుదైవం
బులవేడిన ఫలమేమిగలదు? సర్వమున కీశ్వరుండె దైవము.

తక్ష—రాకుమారా! ఏమి నీబుద్ధికుశలత ? ఎంతయో మెచ్చితిని
గాని నేనొక్కటి చెల్పెద యాలించుము.

చంద్రా—చిత్తము.

తక్ష—తే, గీ. హరిహరాదుల కెరుకలేనట్టి దానిఁ
దెలిపితివి నిన్నువదలంగఁ దలఁచకుంటి
నీరసాతలమందు నీవెలమితోడ
నిలచి సకలసుఖములందు నిర్భయముగ.

రాజనందనా! మాయభిప్రాయమిదియ దీని వినాజేయవలదని నాయిూప్సితము

చంద్రాం—రసాతలేశ్వరా! ఉరగేంద్రా!

తే, గీ. తల్లిదండ్రుల కేనొక్క తనయుఁడ మఱి
యత్తమామల కేనొక్క యల్లుండ మఱి
పరగనాసతి మొదలగు వారు నన్ను
దలఁచిగుండెదరచటికిఁ దరలజేయు.

పన్నగనాయకా! నేనిందేనిలచిన నాస్వజనంబు లెల్లరు నేను గతజీవుండనైతినని దలంచి వంతకుజిక్కి యింత దనుక జీవించి యుండిరో పంచత్వమందిరో నేనెరుంగ గాన నేనీపాతాళమందు బహు దినంబులుండుట బాడిగాదు. నాపైఁ గరుణారస మంది మర్త్యలోకంబున కరుగ నాజ్ఞనొసంగ వేడెద.

తక్ష—(సంతసమున)

కం. మెచ్చితిని రాకుమారా!
యిచ్చకముల్ బల్కఁజాల నీసుజ్ఞానం
బెచ్చోటఁ గానలేదీ
ముచ్చట వినంగ హర్షమును బొందితిఁబో.

మణిమయ భూషణాంబరాదులును, కామగమనంబుగల తురంగ రత్నంబును, చంద్రహాసంబును, తూణద్వయంబును, బహుమానంబుగా నిచ్చెద గైకొనుము.

చంద్రాం—తమ దయకుఁ బాత్రుఁడ

తక్ష—మరియు నీవు నన్నేక్షణంబ దలచిన యాక్షణంబ ప్రత్యక్షం బయ్యెద. నీకువలసినపుడెల్ల యట్లానర్చిన నీకు సాయమయ్యెద. నీకుఁదోడుగా నొక్క రక్కసుని బనిచెద. వానిసాయముగఁ గైకొని నీస్వరాజ్యంబున కరుగుము.

అశ్వసేనుం జూచి

కుమారా! అశ్వసేనా!

కం. విశ్వేశ్వర భక్తుఁడు ధర
ణీశ్వర సుతు నశ్వసేన యెలమిఁ జిగుర్పన్
విశ్వాసమతిశయిల్లఁగ
విశ్వంబునడంచి మరల విడిదికి రమ్మా!

అశ్వసేనా! పురంధరు తురంగంబును గరువంబడంచఁజాలిన మన తురంగరత్నంబెక్కఁదగిన యీరాజనందనునకు నీలవక్త్రుడును నీవును సాయమై మర్త్యలోకమునకుఁబోయిరండు. మరచితిని. నేజెప్పినట్లు గౌరవించి పయనము జేయుము.

అశ్వ—చిత్తము పోయివచ్చెదము.

చంద్రా—పన్నగనాయకా! వందనములు. శలవా?

తక్ష—కుమారా! జయమగుగాక. పోయిరమ్ము.

చంద్రాం—చిత్తము.

అశ్వసేన చంద్రాంగదులు నిష్క్రమింతురు.

తక్ష—(తనలో) ఆహా! నేనెందరనో జూచియుంటినిగాని యీరాకొమరుని మించిన ధీనిధినెందిలకించనైతిని. ఏమీవాని మేధావంతము? ఏమీవానివినయవిధేయత? ఏమీవానిరూపచందములు. లోకమోహనాకారు డనందగు. మరచితిని వాని నశ్వసేనుఁడే లీలఁ గౌరవించునో లోటుజరుగకుండ సేయవలెను. నేనును పోయెదగాక. (నిష్క్రమించును)

యవనిక జారును.

---

తృయరంగము—సీమంతిని నగరు

[ ప్రవేశము : సీమంతినీ, కమల, ]

సీమం:—కమలా! ఈరోజునసేగదా నా వ్రతనీమము ?

కమల:—ఔనమ్మా.

సీమం:—అటులైన మనమాశంకరున కభిషేక మొనర్చుటకు యమునా జలముగొని రావలయును. కలశముగొనిరమ్ము పోవుదము.

కమల:—అటులనేగొనివచ్చెద (స్వ) ఆహా! యేమియీసీమంతిని మన శ్శుద్ధి? యెంతసిపొగడఁగలము? పతివియోగమైనను వ్రతమును విడనాడక నతికుతుకమున సల్పుచున్నది. ఏమీ యీయమ్మ మహిమ? ఆగౌరీశ్వరుల కారుణ్యముచే నీయమకోరిక దీరక పోదు. (ప్ర) అమ్మా! కలశముంగొనివచ్చెద నీవును పయనమై రమ్ము. నేనుపోయెద, శలవా ?

సీమం:—మంచిది పోయిరమ్ము. నేనునువచ్చెద.

కమల నిష్క్రమించును.

శితికంఠా! నీభక్తురాలనే? నిన్ననయము సేవించు సేవకురాలనే? నాయెడ నీకరుణాకటాక్ష వీక్షణముంజూపక మిన్నకుండుట మహాదేవుండనగు నీకుందగునా? దేవాదిదేవుండవు-నిర్వికల్పుం డవు-నిష్కళంకుండవు-అవ్యయుండవు-ఆదిపూరుషుండవు-సర్వ జ్ఞుండవు-నిగమాగోచరుండవు-యజ్ఞపూరుషుండవగు నీవేనా కెం దిలాలించకున్న నన్నుబ్రోచుదైవ మెందుగలడు? శంకరమణీ! కాత్యాయనీశా! పర్వేశా! నన్నిదుఃఖార్ణవమునుండి గట్టువట్టిం పవా? సర్వవ్యాపకా! సర్వమునకు నీయాధ్యగదా? నావంటిదీను రాండ్రమొర లాలింపకున్న నాగతియేమి? హా! యీశ్వరా! పతిలేనినాబ్రతుకిలకుభారముగదా ? అయ్యో! దైవమా!

యమునకేగుచున్నది.

## తురీయరంగము - యమునాప్రాంతోద్యానము.

——:o:——

(ప్రవేశము:- చంద్రాంగదుఁడు, అశ్వసేనుఁడు, నీలవక్త్రుఁడు.)

[ఒకవైపున]

చంద్రాం:— మిత్రులారా! చూచితిరే యుద్యానము సొబగు?

తే॥గీ॥ నాగ పున్నాగ కురువక నారికేళ
చంపకాశోక పనస రసాల పూగ
చంద నాగరు ప్రముఖ వృక్షలత పుష్ప
ఫల భరితమిదిగను ముప వనముసొబగు.

అశ్వసేనా! మనమివ్వనమునంగల పరిమళోపేతమగు సుమంబుల గ్రహించి కొంత విశ్రాంతిఁజెందుదము రండు.

అశ్వ:— చంద్రాంగదసార్వభౌమా! ఏమీ యీవని సౌందర్యము? చూడఁజూడ మనంబున కానంద మొదవుచున్నది. ఔరా! ఏమీ యీభూధరంబులవింత? అందు కలయదిరుగుదమురండు.

చంద్రాం:— రండు పోదము.

ఒకవైపునకు నిష్క్రమింతురు.

[ప్రవేశము—సీమంతిని, దాసి.] [కలశములతో ఒకవైపున]

కమ:- అమ్మా! అటుజూడుము.

సీమం:- (చూచి అచ్చెరువున) చెలీ! ఏమీ యీతనియందము?

ఉ॥ కంతునిబోలు నీతఁడనఁగాఁదగు రూపుధరించియుండె బో
కంతునిమామయన్న గసుగంధపు కాంతులు చూడఁజూడఁగాఁ
బంతుగ నవ్వసంతుఁడనఁ బట్టణపాళ్వము నందెయుండెఁగా
వంతగఁజెంత ద్రిమ్మరెడి యందముగల్గినవారలెవ్వరో ?

కమలా! ఆసుందరాంగుని రూపవయోవిలాసాది శుభలక్షణం బులు వర్ణించతరంబుగాకున్నది. ఆహా? ఏమీ వానియందము?

కమల:—అవును పంచశరుని తిరస్కరించజాలిన యా నవయౌవనాంగుని యందచందములు చూడఁజూడ నత్యద్భుతంబు నొంద జేయుచున్నది.

సీమం:—ఆసుందరాంగుని సౌందర్యాతిశయంబు లభివర్ణించఁదలంపు గల్గినది. కాని వర్ణనకుమించియున్నది యెట్లువర్ణింతును ?

కమ:—అమ్మా! యోచనయేల నీకుఁదోచినట్లు

సీమం:—చెలీ! చూడుము. పరిమళోపేతంబగు బంగరుపొంగడంచు రంగుగల గసుగందని గాత్రమ్మును తుమ్మెదబారుల దూరమ్ముగా బారదోలఁజాలు తెగబారెడు శిరోజములును-చందురుని కళల డిందుపరుపఁదగిన ముఖచంద్రబింబమును కొండపిల్లల దండతనమును మెండుమీరి గండడంచెడి భుజద్వయమును హార్యక్షమును బరిహాసింపఁబూను మధ్యమమ్మునుగల్గిన నవమోహనాంగుడగు నిన్మహామహుని మించివారెందేనిఁగలరా ?

కమల:—ఏమీ నీనేర్పరితనము ? నీవన్న వెల్ల నీతనియందే నిశ్చయముగ నొప్పియున్నవి. ఎంతేయు నచ్చెరువందితి.

సీమం:—సఖి! కాసంతవింతకే నచ్చెరువందితివా ?

కమల:—అవును నచ్చెరువుగాదామరి

సీమం:—చెలీ! అంతయు లోకేశుమాయగదా ?

(ఒకవైపు జూచుచుండును. )

కమల:—(స్వ) కం. వనితామణి సీమంతిని
ఘనముగ దర్కించునట్టి కతయేలనొకో ?
దనపతి లక్షణముంటమి
గనిమొగాఁబోలు నతని గనుఁగొనుచుండెకా.

( ప్రవేశము : చంద్రాంగదుఁడు )

(స్వ) ఆహా! యేమి దీనిసుందరాకారము? మున్ని చిన్నికన్నియను నాకన్నుదమ్ములఁగనినట్లు దోచుచున్నయది. యెచ్చటజూచితి నోగదా? (యోచించి) స్ఫురింపదయ్యనే? ఐనను దీనిగళము సూత్రహీనముగానున్నది. కారణమేమైయుండును ?

(సీమంతినిని సమీపించి)

ఉ॥ ఎవ్వరిదానవే సరసిజేక్షణ! నీజనకుండెవండొ ? నీ
వెవ్వనిరాణివో నిజము నెల్లవచింపఁగదే తలోదరీ!
యివ్విధి చిన్ననాఁడు లభియించినకారణమెద్దొ ? మాతోవా
క్రువ్వవె! శంకరుండు నిన్నుబ్రోచునిజంబిక గుందుటేలనే ?

( సీమంతిని తలవంచి విషాదమున నిరుత్తరయగును. )

కమ:—అర్యా ! మీరలెవ్వరో నేనెరుంగజాల నీకన్నియచారిత్రము వచింపుమని శలవిచ్చిరి. వచించెద చిత్తగింపుడు—

ఈమానినీమణి సీమంతినియను నామంబుచే నీభూమియందుద్భవించి పొగడ్తకెక్కినది. ఈయమ జనకుండమితసుగుణచిత్తుండైన చిత్రవర్మయనుపేరంచిన యశోవిశాలుఁడు యీసుశీలమామ వసథగభీరుండనాబరగి యింద్రసేనాభిధానంబున వన్నెకెక్కిన పుణ్యమూర్తి యీసద్గుణకు సుమవల్లివల్లభుండు నిషధదేశనాయకుండై ముఖారవిందంబున జందురునిసాంద్రకళలతంద్రనొందించఁజాలిన చంద్రాంగదుండను సన్నుతికెక్కియుండ నొక్కనాడు దైవవశంబున యమునానదీ జలమగ్నుండగుటచే నమ్మహాత్మునిదాయ లీసంగతినాలించి యారాజ్యంబుహరించి చంద్రాంగదునిజనకునిబట్టి కారాగృహవాసుఁజేసిరి. యీవిపత్తుంచే నీమె చింతాభరస్వాంతంబుతో యీవర్షాతయంబునుండి యెట్లో కాలముజరుపుచున్నది.

అది యటుండ,

ఆ. సోమవారములను సోమశేఖరుని యీ
సోమవదనపూజ సురుచిరముగ
జేయఁగా నిపుడభిషేకము కొఱకిటు
వచ్చె, దోయములకు సచ్చరిత్రి !

ఈబిడ వృత్తాంతమిదియ

చంద్రా:—(స్వ) దైవవిధి తప్పించుకొనువార లెవ్వారైనగలరే ?

సీమం:—(సిగ్గుచే) ఆర్యపుత్రా నమస్కారము.

చంద్రా:—కళ్యాణీ! కళ్యాణమగుగాక

సీమం:— కం॥ మీారెవ్వరో యిచ్చోనా
చారిత్రింబడుగ సంతసంబయ్యెఁ జుమీా
గౌరవమగు మీాచరితము
ధీరతఁ దెలియంగఁబల్కు దివ్యచరిత్రా !

శ్రీమచ్ఛంకర చరనారవింద మకరందతుందిలేందిందిర బృందాయమానమానసామదన మోహనవిగ్రహా! దుష్టనిగ్రహా! శిష్టపరిగ్రహా ! మీారెవ్వరో యెచ్చటనుం డిచ్చటికి విచ్చేసితిరో, పరివరిగతుల నస్మదీయచరిత్రంబడిగెడి కారణంబెద్దియో ? ఇంతకుమున్ను మీాకనుదమ్ముల నన్నెన్నడైన గనుఁగొనియున్న యెడ వక్కాణించకోరుచున్న యీాదీనురాలి ప్రార్థనంబు నిరర్థకంబుసేయక నిజముగ్గడించ వేడెదను.

చంద్రాం—[విషాదమున] (స్వ)

సీ. దైవసంకల్పంబు ♦ దలఁగఁద్రోసెడిపుణ్య
పురుషులెవ్వార లీ ♦ పుడమియందు ?
జనములు సిథిలమై ♦ జనినను దైవసం
కల్పమునష్టమా ♦ కరణిగలదె ?
కలవారిగన్గొని ♦ కపటాత్ములోర్వంగ
లేనిసంగతిజూచి ♦ మైనగాని

మెల్లకాలంబొక ♦ తెరీతిగానుండు
ఘనులఁగన్గొని యోర్వ ♦ గలఁడె ధాత ?

గీ॥ కాననేశితికంఠుని ♦ కరుణనాదు
రాణియైన సీమంతినీ ♦ మానసంబు
జింతలోఁ బడునట్లుగాఁ ♦ జేయువాఁడొ
హర్షమున నోలలాడించ ♦ నమరినాఁడొ ?

అక్కటా! నేజీవించియుండ నాయర్ధాంగలక్ష్మి సీమంతిని కీదశ యేలసంభవించవలయు? ఏదినంబున నేది యెటులజరుగునో అటుల జరుగక తప్పదుగదా? దైవమా! నాపుణ్యకర్మంబు లేథామములపాలైనవి? నన్నుశోకాక్రాంత స్వాంతుండవగు నటులజేయు కఠినచిత్తమేలబూనితివో తెలియదయ్యె. హా! యీశ్వరా! విధి సంకల్పంబునకు వికల్పంబు జరుగనేరదని బుద్ధులుచెప్పు పెద్దల సుద్దులు ప్రసిద్ధికెక్కినవి. ఐన నేనిపుడీకాంత నేకాంత స్థలంబునకు గొనిచని ముచ్చటించిన లోకులచే దూషణపాలగుటదప్ప వేరొండు ఫలితము లభింపదు.

హా! శంకరా! భావికాలముకన్న గతకాలము మంచిదని యెరింగియు నేనిట్లు చింతిలనేల? "దైవాధీనం జగత్సర్వం" బనునట్లిదియంతయు దైవాధీనమేగాని యొండుగాదు. అయిన మిగిలినదేమియు లేదు. మున్ను వివాహమహోత్సవమందు జరిగిన పాణిగ్రహణము గాక మరలనూతన పాణిగ్రహణంబొనరించి సుధారసంబు లొల్కు సంభాషణలచే నాదేవియంతరంగము నాయందే నిల్చియుండునట్లు జేసికొనియెదగాక.

(చేయిబట్టుకొని-ప్ర) రామామణీ! మేము కామగమనంబున ప్రకాసించు సిద్ధులము. నీప్రాణేశుండింతదనుక రక్షితుండై యున్నవాఁడు. మేమిరువుర మొక్కొకచోట నేకముగానుండుటయు గూడ గలదు. నిజముగా నాతండు రెండుమూడు దినంబుల కిందురాగలఁడు. నీవు నీ

ప్రాణకాంతుని గలసి సకల సౌఖ్యంబులందెదవు. నాపల్కు నిజమ్మని నమ్మి నిన్నుగ్రమ్మకొన్న శోకమ్మును దూరమ్ముగాఁజిమ్మి సమ్మోదమ్ముతో సదనమ్మునకు బొమ్ము.

సీమం:- (స్వ) ఆహా! యేమీ యీదైవచిత్రము? ఎంతయాశ్చర్యము? ఎంతవింత? ఈమహామహుని రూపలావణ్యముంజూడ నామనోహరుండని సందియ మొదవుచున్నయది. కాదేని నాపైనింత భ్రమ ముప్పిరిగా నీతనికొప్పియుండునా? (సందియమున) లేక, నాపతి యాకృతిందాల్చి మరొకరిటువత్తురా? (యోచించి) అయినను అన్యలోకంబు జేరిన నాకాంతుండిపు డిచ్చటికెట్లు రాగలఁడు? ఇదియంతయు వింతగానున్నయది. ఈతండింద్రుడో, చంద్రుడో, గంధర్వుడో, లేక, యుపేంద్రుడాదిగాగల వారలలో నెవ్వరైన గావలయు. ఎవ్వరైననేమి? నాకరంబుముట్టెనే? యీశ్వరా! నాపాతివ్రత్యమునకు భంగంబుగల్గెనే?

ఉ॥ హా! శివ! శంకరా! మరణమందిన నాపతి యెట్టకేల క
త్యాశవహించి వచ్చుట? మహాద్భుతమౌనది చూడఁజూడఁ బల్
వాశిచెలంగగా భ్రమయో, స్వప్నమో, మోహమో, గాని లేక గౌ
రీశునిమాయయో, దెలియ నేటికి శక్యమిదేమి హేతువో?

ఆహా! నేనెంతలో మైమరచి ప్రమాదమందితిని? యెట్టికష్టంబు లేగుదెంచినను, శివపూజదృఢభక్తిచే జేయుచుండుమని యుగ్గడించిన మద్గురుపత్నిశాసనంబతిక్రమించితినే? (తలయూపి) నేనిట్లుకలకబారినమనంబున యావ్రతం బుపక్రమించకుండుటచే నిట్టివిపరీతములు చుట్టవచ్చును. యిందులకు సందియముండదు. ఐనను, మున్నుమాజనకుని నిండోలగంబున విప్రోత్తములు నన్నుంగని పదివేలవత్సరంబులు పతింగలసి సకలసౌఖ్యసామ్రాజ్యమనుభవించునని పల్కిరట. యొకవేళ నేటికది నిజమయ్యెనేమో? కాదేనియిట్టివింతలిలలోగాని, కలలోఁగాని, కలుగఁ

బోవునా? యిదియంతయు నాత్రిపురాసురాది మహిమమని యెంచెద.

చంద్రాం:— లోకమోహినీ !

కం॥ రంగగు కైలాసగిరి భు
జంగాభరణుండు నీదుసరసునితో ను
ప్పొంగుచు శృంగారంబుగ
నంగజకేళీవిలాసమాడించు గదే.

సరసిజాననా! నీయుల్లంబునంగల దుఃఖంబును మల్లించి యుల్లాసంబుగనుంటివేని, యాపై నీవల్లభునిఁగూడి సకలసుఖంబుల నెల్లకాలము రంజిల్లుచుండెదవు. నేనీవృత్తాంతమాతని జననీ జనకుల కుగ్గడించబోవలె. నీవింక యంతిపురంబున కేగుము.

సీమం:—చిత్తము.

చంద్రాం:—మంచిది పొమ్మ,

(నిష్క్రమించును)

సీమం:—నేడు నాకీచిత్రిమునుగన కలయో భ్రిమయోయని నామానస మల్లకల్లోలమగుచున్నది. భయసంభ్రిమంబు లుదయించుచున్నయవి. ముందెట్లుగా జరుగునో, దెలియదయ్యె. అంతయు నీశ్వరాజ్ఞగదా ?

కమ:—అమ్మా! చాలప్రొద్దైనది. జలంబుల గొనిపోవుదమురమ్మ.

సీమం:—(పైకిజూచి) ఔనే చాలప్రొద్దైనది రమ్ముపోవుదము.

నిష్క్రమింతురు.

యవనికజారును.

తృతీయాంకము



# సీమంతిని

## పంచమాంకము.

ప్రథమరంగము—నిషధలో భీమబలుని హర్మ్యస్థానము.

[ప్రవేశము భీమబలుఁడు, ధీమంతుఁడు చండకరుఁడు.]

భీమ—ధీమంతా! నాకేమియుఁదోచక మానస మల్లకల్లోలముగ నున్నయది. భయానకము నా వెన్నంటి విడువకున్నయది. మనమున కెంతయో యారాటముగల్గి తారుమారు జేయుచున్నది. కనుమూయ లెక్కకు మిక్కుటంబగు దుస్స్వప్నంబులు గానబడుచున్నవి. చిత్తము తత్తరిల్లుచున్నది. మిన్నువిరిగి మీఁద దూలిన చందంబున నులికిపాటుగల్గుచున్నది. ఎందుజూచినను నేమో వర్ణించనలవిగాని రూపములు దృగ్గోచరములయి కంప మొందించుచున్నవి. ఎటుజూచిన నపలక్షణంబులే! ఎందేగిన యమంగళంబులే ఎందుజూచిన గుండియలవయుటయే! ఆహా! ఏమీ యీవింత? నాకేమొ నపజయముకల్గునని మిగుల శంకలుదయించుచున్నవి. అమాత్యా! ఇదంతయుజూడ నాకే వింతయు చింతయు భయంబును గల్గుచున్నది. ఇయ్యది కలయా? భ్రమయా? నిక్కువమా? నాకేమియుం దోచుటలేదు. (గుండెల్పై చేయివైచుకుని) నాకెంతయో యారాటముగ నున్నది.

ధీమం—రాజేంద్రా! ధైర్యమూనుఁడు. కాగలకార్యములు కాకమానవు. ధీమంతులు ధైర్యము వాయకుండుటయే శుభంబు.

భీమ—ధీమంతా! ఇంకెక్కడిజయము. ఇంకెక్కడ శుభము?

ధీమం—మీమది ధైర్యమూనుఁడు. సంతసమునసుండుఁడు.

భీమ—ఇంకేటిసంతోషము? మనమున దావాగ్ని పుట్టి దహింపుచున్నది ఇట్లవునని యెఱుంగఁగఁదా? ఆహా! కాలమా యేమిచేయ నెంచితివి.

[ప్రవేశము: అశ్వసేనుఁడు] (ఖడ్గహస్తుఁడై)

ఓరీ భీమబలా! ఖలా! సంతసముగ రాజ్యపాలనజేయుచుంటివా! మదాంధా!

భీమ—(యులికిపాటున) ఏమీవింత? యీతఁడెవ్వఁడు? (తత్తరమున చూచి) ఓరీ! నీవెవ్వడవు?

అశ్వ—ఎవ్వఁడనో జెప్పవలయునా? తొందరొందకుము. సర్వమిపుడే విశదమగును. ఐనవినుము.

ఆ॥ వె॥ ముందు యమునలోమునిగిన జందా్రింగ
దుండు,వచ్చి వనము దండనిలచె
గానమీర లిందు్రసేనునిదోడ్కొని
వెడలిరండు, వేగ వెడలరేని—

ఉ॥ అంగజ రూపుమాపఁగల ♦ యట్టి ధరాధీరుఁడైన చం
దా్రింగదభూధవుండు ♦ యమునానది లోపలనుండి సత్వరో
త్తుంగ తురంగమెక్కిలయ ధూర్జటిరీతుగ నిప్పురంబు చెం
తంగల కాననంబున ఘనంబుగనుండె ముదంబుమీరగన్.

మీరిద్యేడ నింద్రసేన రాంజేంద్రుని బంధమోక్షంబు గావించి శీఘ్రింబుగ సింహాసనంబువిడచి యమ్మహాత్మున కెదుర్కొన వచ్చెదరో లేక కయ్యంబునకు వచ్చెదరో ఖండితంబుగ దెల్పుడి. మీరట్లు రెండు కార్యంబు లంగీకరింపరేని యాతండే యిచటి కరుదెంచి యురగేంద్రుడొసంగిన చంద్రహాసంబుచే భవదీయ శీర్షంబులెల్ల నిద్రాయణీదేవికి బలిగా సమర్పించి యిప్పురిని దిగు

గఁబరిపాలన సేయఁగలఁడు. నేనురగపతి సూనుండ అశ్వసేనుం డనువాఁడ. చంద్రాంగదునకు సహాయంబుగ వచ్చినాఁడ.

భీమ—అశ్వసేనా! యమునలో మగ్నమైన చంద్రాంగదుండువచ్చెనా?

అశ్వ—ఇకను వచ్చెనా యనుచుంటివా?

భీమ—అంతయు మహా చిత్రముగానున్నది.

అశ్వ—ఔను! నీచరిత్రమంతయు చిత్రముగానే యున్నది.

భీమ—ఇపుడే యింద్రసేనుని బంధమోక్షముగావించి వచ్చుచుంటిమి. నీవు పొమ్ము.

అశ్వ—శీఘ్రింబరావలయు.

భీమ—అమాత్యవరా ! నామదిజనించిన యారటమున కిదియేకారణము. ఇంక మనయాట లుడిగినవి. చంద్రాంగదునాజ్ఞ నిర్వర్తించకున్న మనగతుల నుడువంబనిలేదు. కాన శీఘ్రిం బట్ణ సేతమురండు.

అందఱు—చిత్తము. (యవనికజారును.)

## ద్వితీయరంగము.

### యమునాప్రాంతోద్యానము.

ప్రవేశము : చంద్రాంగదుఁడు (అలంకృతుఁడై)

పురముప్రవేశించి యశ్వసేనుడింక రాడయ్యె. కారణమేమై యుండనోపు? నన్ను బాసిక్షణమైనయుండడే ఇదేమి ?

[ప్రవేశము : అశ్వసేన, ఇంద్రసేన, మంత్రి, పౌరులు]

చంద్రాం—జనకా! నమస్కారము.

ఇంద్ర—(చంద్రాంగదు నాలింగనముస) తనయా! శుభమగుగాక తండ్రీ ఎంతకాలమునకు నిన్నుఁగంటిని ?

కం॥ ఓరీ! ముద్దుకుమారా!
యేరా యీదైవచిత్ర • మేమనవచ్చున్ ?
గూ్రరాత్ముఁడైన ధాత్రృ వి
కారంబులుగావె? యిట్టి కల్పనలెల్లన్

శ్రీమచ్ఛంకర కరుణాకటాక్ష వీక్షణంబులంచే దిరుగ యమునా నదిలోమునిగిన నిన్గంటిమి. ఏమీ నాయదృష్టము? ఏమీ నా ధన్యత? ఏమీ నాశుభదినము? కుమారా! నీకిట్యవస్థ లభ్యం బగుకతంబున పునర్జన్మమెత్తితివిగదా ? నిన్నుగాంచిన యీదిన మెంతపుణ్యదినము ?

చంద్రా—జనకా ! మీయాశీర్వాదంబును అయ్యుమేశ్వరు గరుణా కటాక్షంబును గల్గువరకు నాకిసుమంతయైన కొరంతలుండునే?

ఇంద్ర—సచివవరా! చిత్రవర్మధాత్రీపతి కస్మత్పుత్రుని విచిత్రకథ దెలుపునొకజాబు నంపుము. దానవారును సంతోషాయత్త చిత్తులగుదురు.

మంత్రి—చిత్తము పురప్రవేశమైనతోడనే బంపుదము.

ఇంద్ర—తండ్రీ! గృహంబు సేరరమ్ము.

చంద్రాం—చిత్తము అశ్వసేనారమ్ము. సచివచంద్రులారా! పురవాసులారా! అంతయు మీయాశీర్వాదముచేతనే యిట్టి చిత్రము కల్గినది. అందు నాకెంతేని యాయాసములేక సౌఖ్యముగ కాలముంగడపి వచింపనలవిగాని చిత్రములుగని మితిలేని యానందమొంది తక్షకేంద్రునిచే పారితోషకములంది మరల నీ లోకమునకు వచ్చినాడ. మీకెల్లరకు కుశలమేగదా ?

పౌరు—దేవా ! మీరాకయే మాకు కుశలము. అంతకన్న నేమి గావలయు.

చంద్రా—ఇందు దడయరాదు. పురములోనికిం బోవుదమురండు.

అందఱు—చిత్తము.

వరుసగా నిష్క్రమింతురు—యవనికజారును.

---*---

తృతీయరంగము.

చిత్రవర్మ యాస్థానము.

[ప్రవేశము : చిత్రవర్మ, సుగుణాకరుఁడు]

చిత్ర—సచివతంసమా! నేఁడేమొకోగాని నాకు జనించుచున్న యానందమునకు మితిలేకున్నది, ఎందుజూచిన నంతయు శుభసూచకములై గన్పట్టుచున్నవి. కర్ణములకు మంగళవాద్యారావంబులు వినబడినట్లు ధ్వనియిచ్చుచున్నవి. ఇదేమిభ్రమ? యిందుల కేమిఫలమోగదా?

సుగు—దేవా! శుభకాలమునం దన్నియు నట్లేయగును. దేవరవారికి శుభముచేకూరు లక్షణములుగాని మరొండుగావు. మీరింక ధన్యులు.

ప్రవేశము : సేవకుఁడు] (జాబుతో)

దేవా వందనములు.

సుగు—ఓరీ! నీవెవ్వడవు? ఇందురాగతమేమి?

సేవ—ఇంద్రసేను రాజేంద్రుని పనుపున నిషధనుండి జాబు బొందు దెచ్చితి. ఎల్లరకు శుభదినమయ్యె. జాబు గొనుఁడు.

(మంత్రి దీసుకొనును.)

చిత్ర—మంత్రీ! అందేమి లిఖించెనో జదువుము.

సుగు—చిత్తము (జాబువిచ్చి)

సీ॥ శ్రీమన్మహారాజ శేఖరుండింద్రసే
నాఖ్యుండు జిత్రవర్మావనీశ్వ
రుని, వేడ్క- నాయురారోగ్య సంపత్పుత్ర
పౌత్రాభివృద్ధిగా బ్రాకటముగ
నాశీర్వదించి వ్రాయంగలదిచ్చట
నిషధపురంబున నెమ్మితోడ
నున్నారమిక మీద నొప్పుగా మీశుభ
వార్తనులిఖయించి బనుపవలయు
నటులెదుపరి! యస్మధాత్మజుండైన చం
ద్రాంగదుం” డయ్యమునాజలాంత
రాళంబునందున రాజిలుపన్నగ
లోకంబుజేరియా లోకనాధుం
డైన, నాగేంద్రుచే ననుపమమణిగణ
భూషనాంబరముల తోష మొదవ
నశ్వరత్నము జంద్రహాసము గొనిస్వేచ్ఛ
జనుదెంచెతత్కళ తెనయుతోడు
గానె దోడ్కొనివచ్చె, గాన యీసచ్చరి
త్రంబు శ్రేష్ఠముగ నిజమ్ముసుమ్ము.

గీ॥ శ్రీకరంబగు దొలినోము చేతమనకు
రాజశేఖరునరకృపా రాశినిట్టి

ముచ్చటలుగ్రక్లేఁదెల్పి తీముచ్చటలను
వ్రాయగలశుభములు వ్రాయవలయుదిరుగ

| | | |
|---|---|---|
| నిషధసుదినము. | } | ఇట్లు<br>ఇంద్రసేనుఁడు. |

ఏమీావింత? అంతయు నాశ్చర్యముగా నున్నయది. ఈ వార్త నిజమని యుగ్గడించ వలనుబడునా ?

సుగు—నిరుత్తరుండగును.

చిత్ర—సుగుణాకరా !

సీ॥ మనల మోసముఁజేయగా మదిదలంచి
యిందృసేనుని దాయాది లిట్లువ్రాసి
రంచుదోచెను, నీవు యోచించుమింకఁ
జచ్చిపోయిన యల్లుండు వచ్చుటెట్లు ?
ఈజాబు నమ్మదగదు. అంతయు కైరడమని తోచుచున్నది.

సుగు:—ఇందు నిషధాధీశ్వరుండగు ఇంద్రసేనుని చేవ్రాలుగలదు. సందియమువలదు. అంతయు సత్యమే.

చిత్ర:—అంతగనమ్మజాల.

సుగు—ఇదియెల్ల సీమంతినీ వ్రతప్రభావమని దోచుచున్నయది. నిషధేశుండు మనక్షేమమునుగూడ దెల్పుమని వ్రాసియుండె. తిరుగ లేఖ వ్రాయుటవసరము.

చిత్ర—అట్లే వ్రాయవచ్చు. ఈసేవకునితోడ మనసేనానాయకునంపి చద్రాంగదు నిచటికివచ్చునట్లు సేయమంచిదని నాయభిప్రాయము. నిజమైన ఆతడు రాగలడు.

సుగు—చిత్తము. (అని జాబువ్రాసి)

దేవా లేఖ చిత్తగింపుడు.

శ్రీమన్మహారాజాధి రాజవీర ప్రతాపులును నిషధాధి పతులు నగు మహారాజశ్రీ ఇంద్రసేనరాజేంద్రునకు రాజధాని పురాధీశ్వరుండగు చిత్రవర్మవ్రాయు లేఖార్థంబులు. ఇచట మాకు క్షేమము మీసుఖములు దెల్పవలయును. మీరు వ్రాసినజాబందినది. అదియంతయు శుద్ధకేరడమని యెంచినాము. అడసత్యమైన మదీయజామాతను తీవ్రముగ రాజధాని యనుపవేడెదము. అట్లు జరుగకున్న దాయలకృత్యమని నిశ్చయము

రాజధానినగరము } ఇట్లు,
చిత్రవర్మ.

చిత్ర—మిక్కిలి యుక్తముగ నున్నయది. శీఘ్రింబ బంపుటుచితము.
సుగు—చిత్తము ఎవడురా ?

[ ప్రవేశము : సేవకుడు ]

దేవా! శలవు.

సుగు—ఈజాబుంగొని నిషధకేగి ఇంద్రసేన రాజేంద్రునకిచ్చి కుమార రాజగు చంద్రాంగదునిందు దోడ్కొనిరమ్ము. [ జాబిచ్చును. ]
సేవ—చిత్తము. [ జాబుతో నిష్క్రమించును. ]
చిత్ర—సుగుణాకరా! కొన్ని కారణములచే సత్యమేగావచ్చును. అయిన సందియమొకమూల శాధించుచున్నయది. ఎట్లైనగానిమ్ము, సీమంతిని నలంకరించ నాజ్ఞనీయవలెను. గాన నంతిపురంబేగుటవసరము.
చిత్ర—చిత్తము. (లేచును.)
(నిష్క్రమింతురు.)

---

చిత్ర—సుగుణాకరా! కొన్ని కారణములచే నాల్యమేగావచ్చెను. అయిన సందియము మొకయూల బాధించుచున్నయది. ఎట్లైనగానిమ్ము సీమంతిని నలంకరించ నాజ్ఞనీయవలెను గాన సంతిపురంబేగు టవసరము.

చిత్ర—చిత్తము. (లేచును)

(నిష్క్రమింతురు)

---

తురీయరంగము—ఇంద్రసేనునిమాస్థానము.

[ప్రవేశము: ఇంద్రసేనుఁడు, చంద్రాంగదుఁడు, ధీమంతుఁడు]

ఇంద్ర—ధీమంతా! రాజధానినుండి మన సేనాని రాడయ్యె. కారణమే మయ్యెడిని? ఇంతజాగేలజేసె?

చంద్రాం—రావలదా మరి? రాజధానియందు నిచటగలదా?

[ప్రవేశము: సేవకుఁడు]

నిషిధేశ్వరా! ఈజాబుఁగ్రహింపుడు.

ఇంద్ర—నీవెవ్వండవు? ఎవ్వనిపంపున వచ్చితివి? (జాబందుకొని)

సేవ—దేవా! అంతయు జాబునం దేగలదు.

ఇంద్ర—(జాబుంజూచి సంతసమున) ధీమంతా! వింటివే? మనజాబు కేరడమనియు దాయల కల్పితమనియు నిశ్చయించిరట. నిజమగునేని చంద్రాంగదునంపుడని వ్రాయబడినది. ఇందు నీయభిప్రాయంబేమి?

ధీమం—దేవా! వారుకోరినట్లు సేయుటుచితమని దలంచెద.

సేవ—దేవా! మాయేలిక మొదల్కు పౌరులవరకు మీకుమారుని జూడ గోరి తొందరొందుచున్నవారు గాన వైళంబపయనము. సచివయుతముగ మీరునురండు.

ఇంద్ర—మంచిది. అట్లనేపయనము (చంద్రాంగదుఁజూచి)

కం. నాచిన్ని పుత్రరత్నమ !
వోచంద్రాంగద! సురూప! యొప్పఁగఁగనఁగా
నాచిత్రవర్మ దలచి మ
హాచతురుని వీనినిటరయుంటుగబనిచెన్.

కుమారా! సంతసమొదవు కాలమగుటచే నాతండుకోరి మనల నాహ్వానముజేసె గాన బోవలె తగురీతినుండుము. అమాత్యా! పోవలదా ?

ధీమం—పోవలదామరి ?

ఇంద్ర—పయనమునకు తగు ప్రయత్నము జేయుము.

ధీమం—చిత్తము. (యవనికజారును)

పంచమరంగము—చిత్రవర్మయాస్థానము.

[ప్రవేశము: చిత్రవర్మ, సుగుణాకరుఁడు]

(ఆసీనులై)

చిత్ర—సుగుణాకరా! సేవకుడింకను రాడయ్యె కారణమేమి? అంతయు కేరడమగునా? కాకనిజమయ్యెనేని,

కం॥ సంతసమెంతయు గల్గగ
మంతనమున గారవపు కుమారికయగు సీ
మంతినికిఁ, దిరుగబెండిలి
సంతసమతి జేయువాఁడ సత్కారముగన్.

చంద్రాంగదుడిందువచ్చిన నిముసమే యట్లొనర్చెద.

సుగు—రాజేంద్రా! మీకోర్కెఁదీరకపోదు.

[ప్రవేశము: సేవకుఁడు]

దేవా! నిషధేశ్వరుఁడు తనూజునితో వచ్చుచుండె.

(అందరు లేచి నిలచెదరు)

[ప్రవేశము: ఇంద్రసేన, చంద్రాంగదాదులు]

చిత్ర—నిషధేశ్వరా! ఎంత సుదినము? (కౌగలించుకొని) జామాతా ధన్యుఁడను. కృతార్థుఁడను. ఇయ్యుచితాసనము నలంకరించుడు.

(అందరునుఁ గూర్చుందురు)

చంద్రాం—మామగారు! వందనం బాచరించెద.

చిత్ర—జామాతా! ఆనందభరితుడనైతి. ఇందుగూర్చుండుము.

(చంద్రాంగదుఁడు కూర్చుండును)

చంద్రాంగదా! చిరంజీవి! నేఁటికిఁగదా నిన్నుఁజూచుభాగ్యముఁ సుగుణాకరా! మన పురోహితుల శీఘ్రుంబరావింపుము,

సుగు—చిత్తము. సేవకా!

(ప్రవేశము: సేవకుఁడు)

దేవా! శలవు.

సుగు—రాజాజ్ఞయయ్యెనని రామసిద్ధాంతిని, భీమసిద్ధాంతిని త్వరితముగ దోడ్కొనిరమ్ము.

సేవ—చిత్తము, (నిష్క్రమించును)

[పునః ప్రవేశము: సేవకుఁడు బ్రాహ్మణులతో]

(అందరు లేచి) భూసురులారా వందనములు.

రామ—శుభమస్తు.

చిత్ర—పుడమిదేవులారా! ఇయ్యాసనము లలంకరింపుఁడు.

రా. భీ—చిత్తము. (కూర్చుందురు, అందరు కూర్చుందురు)

రాను—దేవా!. మమ్మాహ్వానింప కారణము శెలవీయవేడెదము.

చిత్ర—సీ॥ విమలమానసులార! విప్రపుంగవులార!
పనివడి నే దెల్పుఁ ఫక్కి వినుడు
నాదు జామాత చంద్రాంగదమహారాజు
మోదంబుతో వచ్చె భూస్థలికిని
గాన, నాతనికి నాగారాబుకొమరిత
యైనసీమంతిని, కేనుమగుడఁ
బరిణయంబొనరించు పనిఁబూనినాడను
దిరమతిమీరలు దివ్యమైన

గీ॥ శుభముహూర్తమునొక్కటి జూచివేగ
రభసముగ జెప్పుడింకఁ దర్కంబు జేసి.

రామ— చిత్రవర్మ మహారాజ! చెప్పనేల ?
నడిగితిరి మంచికాలమునందుమీరు.

కం. ఓరాజకులోత్తంసా !
యీరడిగిన శుభముహూర్త మీదివసమునన్
దారాబల చంద్రబలం
బారూఢంబయ్యె, వీరికరసిగనుఁగొలన్.

భీమ—రాజేంద్రా ! యీదివసంబున దివమందు ద్వితీయయామంబున
మీనలగ్నముయొక్క పుష్కరకాలంబున పురందరాచార్యుఁడు
వర్గోత్తమాంశనుజెంది సంపూర్ణ వీక్షితుండైయున్నవాఁడు. అట్టి
సుకృతకాలంబున జరిగించితిరేని మాకన్యక సకల సంపత్పుత్ర
సౌభాగ్యయుక్తయైయుండుట నిశ్చయము. ఇది లగ్నబలము.

చిత్ర—చిత్తము.

కం. మంతిరి సుగుణాకర! నీ
మంతినికిని దిరుగబెండ్లి మాన్యులు జెప్పన్
మంతనమున దృఢపరచితి
నంతయుఁ బౌరులకుఁ దెలియునటుజేయుఁడికన్.

సుగు—చిత్తము. సేవకా! చిత్రవర్మ మహారాజుగారి యల్లుండగు చంద్రాంగదమహారాజు కాళిందీ జలాంతరాళంబున మునిఁగి పాతాళలోకంబుజొచ్చి అచ్చటగల తక్షకాహీంద్రునిచే దివ్యాంబరాభరణాదులంది తిరుగ నీలోకంబునకు విచ్చేయుటచే మరల జిత్రవర్మమహారాజు తమకొమరిత సీమంతినిఁనియిచ్చి పునర్వివాహముజేయునట్లు పెద్దలీదివసంబున పదునొకండుగంటలకు శుభముహూర్తమునిశ్చయించినారలని మనపురమునంగల పౌరులకు దెలియునట్లు చాటించ నొకని బంపుము.

సేవ—చిత్తము. (నిష్క్రమించును)

చిత్ర—మనపురమంతయు విచిత్రంబుగ శృంగారించ పౌరులకు నాజ్ఞనొసంగుము.

సుగు—చిత్తము. ఎవఁడురా !

[ప్రవేశము సేవకుఁడు]

దేవా! శలవు.

సుగు—పురమెల్ల రామణీయకముగ శృంగారించవలెనని పౌరులకుం దెల్పిరమ్ము.

సేవ—చిత్తము. (నిష్క్రమించును)

చిత్ర—సుగుణాకరా! ఇంక జాగుసేయరాదు ప్రయత్నమున నుండవలె గదా? కాలము లగ్నమునకు సమీపించినది లెమ్ము. నిషధాధీశ్వరా ! రండు.

(వరుసగా నిష్క్రమింతురు యవనికజారును)

ప్రవేశము రామసిద్ధాంతి, భీమసిద్ధాంతి

రామ—మనరాజుగారింత త్యాగశీలుడని నేనెఱుంగ సుమా?

భీమ—అమ్మా! అట్లనకుఁడు బ్రాహ్మణులన్న నధికభక్తి యుక్తుండు. నీమధ్య నల్లుని బెంగచే నేమియు వ్రతములు దానములు చేయుటలేదుగాని పూర్వము నీవెఱుంగవా ?

రామ—ఔను! సీమంతినీ చంద్రాంగదుల పరిణయము మాత్రము చాలముచ్చటగ నున్నది. బ్రాహ్మణులకు "యిష్టమృష్టాన్నము" కోరిన సంభావన పట్టుశాలువలు ఆహా! యేమీ? రాజన నీయనకే జెల్లును. బ్రాహ్మణుల పేరు పేరు వరుసన బిలచి యెంతశ్రద్ధగ దానములిచ్చినాడు?

భీమ—ఔను! వారికేమి? చక్రవర్తులు ఎన్ని దానములైన జేయుదురు. ఎన్ని వ్రతములైన జేయుదురు.

రామ—అందరకిట్టి త్యాగముండవలదా?

భీమ—లేకేమిలెండి. రాజశబ్దము ధరించినవాని కెల్లకాస్తోకూస్తోగలదు.

రామ—అబ్బేఅట్లనకుము. నేకొందర రాజులజూచితిగాని అందు లుబ్ధాగ్రేసర చక్రవర్తులు గూడ గలరు.

భీమ—వుండిన నుండవచ్చు(పైకిజూచి)చాలతడవైనది.తీవ్రముగనుండు.

రామ—(పైకిజూచి) ఔను! వివాహ తతంగము సామాన్యమా?అంత శాస్త్రయుక్తముగ నగువరకింత కాలముబట్టినది.మరొకచోటా! అయిన కాడికిపీలుకొలది మంత్రముల వీడి జెప్పుటకు? అది రాజస్థానమాయె.

భీమ - ఇంక మాటలబెట్టకుఁడు. క్షుత్తు దహించుచున్నది.

నిష్క్రమింతురు.

## షష్టరంగము—సీమంతిని నగరు

[ప్రవేశము చిత్రవర్మ, సీమంతిని, దాసి]

చిత్ర—అమ్మా! సీమంతినీ!నీవెంతయో పూజ్యురాలవు కనుకనే యిట్టి కాంతుడు లభించెను.అమ్మా!మన సనాతన ధర్మములరీతి పయనము జేయుక దప్పదుగదా? నిమనమున బెంగయుంచు కొన

కుము. నీకుచేతోడు వాదోడుగ నీసఖురాలుండును. దానిచే కాలము సంతసముగ వెళ్ళబుచ్చుము. అమ్మా! నీమనమున ధర్మముల మాత్రము పరాకునైన మరువకుము.

సీ॥ అత్త మామలయెడ నుత్తమభక్తితో
వలసిన శిశ్రూష సలుపుమమ్మ!
పతియె దైవమటంచు మతిలోన భావించి
ధవుని యానతి కష్టదాటకమ్మ!
తోడివారలగన్న తోబుట్టువులఁబోలె
సురుచిరంబగు ప్రేమఁజూడుమమ్మ!
దాసజనాళిఁ బేదలను నెల్లప్పుడు
గన్నబిడ్డలరీతి గాంచు మమ్మ!
గీ॥ యింటగలకృత్యముల నీవయీడుమమ్మ!
పరుషములు గేరడంబులు బలుకకమ్మ!
నిర్మలంబగు సత్కీర్తి నిలుపుమమ్మ!
రమణి! సీమంతినీ! పోయిరాగదమ్మ!

సీమం—జనకా మీయాజ్ఞరీతి మెలంగెద. శలవొసంగుఁడు.

(కంటతడిపెట్టును)

చిత్ర—(కనులు దుడుచుచు)అమ్మా! దుఃఖించకుము. ఆడుబిడ్డల పుట్టి నింటనుంచుట ధర్మవిరుద్ధమని నీవమెఱుంగవా? వేలరీతి నిట్లు కుంచెదవేమి. తల్లియు దండ్రియు గురుఁడును దైవమునునాథుడే యని సభక్తిసపర్యలొనర్చుచు పుట్టినింటికి మెట్టినింటికి వన్నె దెమ్మ. పడతికిపాతివ్రత్యమే పెట్టనిభూషణము. అదియేయిహ పరములకు బట్టుగొమ్మ. అదియేతులలేని సౌఖ్యము. అదియే బంధుమిత్రులకు బరమానందము గాన నీవీరీతి మెలంగుట నా కదియే ముదావహము. అమ్మా! బెంగమానుము. పయనము నకు ముహూర్తము సమీపించినది లెమ్ము.

సీమం—చిత్తము (యవనికజారును)

సప్తమ రంగము—నిషధలో మదనసాయక నగరు.

[ప్రవేశము: మదనసాయక, సీమంతిని, దాసి]

దాద—సీమంతినీ! నీవ్రతప్రభావ మేమనివర్ణించగలము? నీవ్రతప్రభావము చేతనే నాకులవర్ధనుని, నానోము ఫలమును, నాపున్నెముల రాసిని, నాచిన్నియన్నను గన్నుదమ్ములజూచుభాగ్య మబ్బినది. ఆహా! నాసంతసమునకు మేరలేకున్నది. అమ్మా! నీవు కేవలము దైవస్వరూపురాలవుగాని మానవమాత్రురాలవు గావు. నీదైవ భక్తికి నీపతిభక్తికి పెదలయెడ వినయ విధేయతలకు నీకు చాలినబోటు లీపుడమినిలేరని నొక్కి వక్కాణించగలను. నీకీర్తిచంద్రికలీ పుడమిపై నాచంద్రార్కమునిలచుగాక.

సీమం—అత్తగారూ! నన్నిట్లగ్గించ బాడిగాదు. అంతయు లోకనాథుం డగు యుమానాథుని కరుణాకటాక్ష వీక్షణముచేతను మీయా శీర్వాదముచేతను జరిగిన చరిత్రగాని మరియొండుగాదు. దైవ స్వరూపుండును మాతాపితృభక్తి పరాయణుండును; సత్య సంధుండునునగు మీసుపుత్రునకెందేని యపజయముకల్గునా? వారిసత్యమె వారినిగాచి రక్షించినది. యిందునావ్రితప్రిభావ మేమియులేదు. మాకెల్లరకు మీదయయే యింతసంతసమును సౌఖ్యమును గూర్చినది.

మద—సీమంతినీ! నీవు ధన్యురాలవగుకతంబునవే

ఉ. కంతునిచేతి బాణమనఁగాఁ దనరారి ముదంబుమీర సీ
మంతిని; సోమవాసరము మాసతినాథుని బూజ దంపతీ
సంతతి పూజసల్పి రభసంబు దలిర్పఁగఁ గామితార్థముల్
శాంతినొసంగుచుః విభుని సన్నిధినుండగ నోమితేబళా!

సీమం—(నమస్కరించి) అంతయు మీయాశీర్వాదమనినమ్ముదు.

మద—నేడుమిమ్ము రాజ్యాభిషిక్తులజేయుప్రయత్నములుజరుగుచున్నయవి గాన ధర్మముతప్పక ప్రజలబిడ్డలరీతి బాలింపమనమునని శ్చయించుము.

సీమం—చిత్తము. యవనికజారును.

సప్తమరంగము—పట్టాభిషేక మంటపము.

[ప్రవేశము: ఇంద్రసేనుఁడు, బ్రాహ్మణుఁడు, అశ్వసేనుఁడు, పురజనులు]

ఇంద్ర—నిషధపురవాసులారా! నేఁడు చంద్రాంగదునకు పట్టముగట్టి నేనింక విశ్రాంతిగ నిశ్చలస్వాంతుండనై భగవన్నామము జేయుచు కాలము గడుప నిశ్చయించితిని. ఇందులకు మీరంగీకరింతురు గాక. భూసురోత్తమా సిద్ధితమైన శుభలగ్నము నేడేగదా ?

బ్రాహ్మ—చిత్తము.

ఇంద్ర—ఎవఁడురా ?

[ప్రవేశము: సేవకుఁడు]

దేవా! శెలవు.

ఇంద్ర—చంద్రాంగద సీమంతినీ వధూవరుల సత్వరము పట్టాభిషేక మంటపంబు జేర వార్తదెల్పిరమ్ము.

సేవ—చిత్తము. నిష్క్రమించును,

[ప్రవేశము: చంద్రాంగదుఁడు, సీమంతిని, దాసి]

ఇంద్ర—తనయా! మీనూతనదంపతులీ రత్నసింహాసన మధిష్ఠించియీ నిషధపుర నాథుండవై రాజ్యంబు పూజ్యంబుగ బాలింపుము. ఇదియే నాకోరిక.

చంద్రా—చిత్తము. జనకా! నమస్కారము. భూదేవా! వందనము. పౌరులారా! మీకెల్లరకు స్వాగతము.

సీమం—మామగారూ! వందనము. భూసురా! నమస్కారము. పౌరులారా స్వాగతము.

బ్రాహ్మ—నవీనదంపతులారా! జాగు సేయక సింహాసనమధిష్టింపుడు.

(చంద్రాం, సీమంతిని, సింహాసనాసీనులగుదురు)

"దేవీంవాచమజనయంత దేవాః । తాంవిశ్వరూపాః పశవోవదన్తి
సానోమంద్రేషమూర్జందధానా । ధేనుర్వాగస్మానుపదిష్టుదైతు"

(అంత సర్వవాద్యములు మ్రోగును)

అశ్వ—(కర్పూరము వెలిగించి)

కం. చంద్రాంగద రాజునకున్
కందర్పాకారునకును గంజాక్షునకున్
సాంద్రగభీరునకున్ నృప
చంద్రునకిదొ మంగళంబు సరసమిగుర్పన్.

చంద్రాం—మిత్రమా!

చం॥ ఉరగకులేంద్రనందన మహోన్నతి నేనిడినట్టి భూషణాం
బరముల సంగ్రహించి పరిపాటిగ మీ దయనించి బ్రోవుమీ!

అశ్వ—నరవర నీసపర్యల ఘనంబుగనందితి, మత్పురంబు కేనరిగెద

చంద్రాం-మీగురూత్తమున కంజలి జేసితి నంచుఁజెప్పుమీ.

అశ్వ—చిత్తమట్లనే వచించెద.

చంద్రాం—ఆర్యులారా! నేఁటినుండి మీకొడయుడనగుకతంబున భక్తి విశ్వాసములజూపుచు స్వధర్మ నిష్ఠాపరులై మెలంగుట పరమ ధర్మము. అదియే ప్రజలధర్మము. రాజును ప్రజలబిడ్డలరీతి నేకొరంతలు లేక పాలించుట యాతనిధర్మము. ఇట్లనే మనరాజ్యమందేరాయిడియు లేక మెలంగవలెను.

యవనిక జారును.

గద్య.

ఇది శ్రీమచ్ఛంకర వరప్రసాద లబ్ధ
కలితావిచిత్ర, బోధాయనసూత్ర
భారద్వాజసగోత్ర, మల్లయా
ర్యపుత్ర వేంకటశివనామక
విరచితంబగు సీమంతిని

పంచమాంకము

సంపూర్ణము.

---



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA125B150 |
| పుస్తకం పేరు | సీమంతిని |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 95 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 11 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Vedavathi |
| పేజీలు విడదీసినది | Vedavathi |
| | ch. Ramya |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good. |